పురాతన శాస్త్రాల ఆధారంగా

# పుట్టుమచ్చల ఫలితాలు

అరవింద్



ప్రపంచంలోనిఅనేకశాస్త్రములలో జ్యోతిష్యముతోపాటు సాముద్రికము. సంఖ్యాశాస్త్రము, స్వప్నం (కలలు) అలాగే పుట్టుమచ్చలు శాస్త్రము వున్నాయి. ఏ శాస్త్రము నందైన విశ్వాసము ముఖ్యము. నమ్మకం లేకపోతే తెలుసుకున్న విషయములకు ఫలితముండదు.
ఈ పుట్టుమచ్చల శాస్త్రములోని ఫలితములు సులభశైలిలో వివరించడం జరిగింది.

ఈ శాస్త్రములోని విషయాలు అవగాహన చేసుకొని ఫలితము తెలుసుకోవాలి. శరీరంపై పుట్టుమచ్చలు లేని మనిషి దాదాపుగా వుండడు. పుట్టు మచ్చలు గురించి మంచి- చెడు నిర్ణయించటం కొంచెం కష్టమే. పరిశీలనగా గమనిస్తేగాని కనిపించనవి కొన్ని, కొన్ని పెద్దవిగా వుంటాయి. ఎక్కువగా పెద్ద మచ్చల ఫలితములనేపరిగనలోకి తీసుకోవాలి. వారి స్వభా వమునుబట్టి కొన్ని పుట్టుమచ్చలను వూహించవచ్చు. వ్యాధుల వలన, అపరేషన్ల వలన కొన్ని పుట్టుమచ్చలు తొలగిపోయే అవకాశముండవచ్చు. మనిషి ఫలనా అని గుర్తించడానికి పుట్టుమచ్చలను బట్టి నిర్ణయించడం జరుగుతుంది. అంతేగాక పిల్లలకిగుర్తులుగా పుట్టుమచ్చలని స్కూల్ రికార్డులలో, బర్త్ సర్టిఫికెట్‌లలో, పాస్‌పోర్ట్‌లలో , ఉదహరించడం మనం గమ నిస్తూనేవున్నాము.

మనిషిని గుర్తించడానికి సాధనముగా పుట్టుమచ్చలు ప్రఖ్యాతి గాంచినవి. శాస్త్రాలను పరిశీలించిన పుట్టుమచ్చలకు మహత్తు గలదని పూర్వులు చెప్పటం జరిగింది. వాటి భావము వాటి స్థానము బట్టి ఫలితాలు గ్రహించాలి.

పుట్టుమచ్చలు అంటే పుట్టుకతో వచ్చినవి. అంతేగాక పుట్టుమచ్చ రంగు, ఆకారము పరిమాణము, పుట్టుమచ్చ వుండే స్థానము పరిశీలించాలి.

పుట్టుమచ్చలు శరీరం యొక్కరంగును బట్టి రకరకాల రంగుల్లో వుంటాయి. వాటిలో పసుపు,ఆకుపచ్చ, తేనె, ఎరుపు, ముక్కుపొడుం

రంగు, నలుపు రంగుల్లో వుంటాయి.

ఈ రంగులను బట్టి ఫలితాలు కూడా వుంటాయి.

| | | |
|---|---|---|
| పసుపురంగు | - | సాధారణ ఫలితము |
| ఎరుపు | - | మంచి ఫలితము |
| తేనె | - | మిక్కిలి శుభఫలితము |
| ఆకుపచ్చ | | మంచి ఫలితము |
| గంధం | - | సాధారణ ఫలితము |
| నలుపు | - | చెడు ఫలితము |

ఆకారము బట్టి పుట్టుమచ్చలు వివిధ ఆకారములు కలిగి వుంటాయి.

1. చుక్కలా వుండేవి
2. సన్నగా పొడవుగా వుండవి;
3. వంకరగా వుండేవి
4. చదరంగా వుండేవి
5. ముక్కోణపు ఆకృతి కలిగినవి.
6. పుట్టుమచ్చలపై వెంట్రుకలు కలవి.
7. పెద్దవిగా వుండేవి.

సన్నగా పొడవుగా వుండేవి మంచి ఫలితము నివ్వగలవు.

పెద్దవిగా వంకరగా వుండేవి చెడుఫలితము నివ్వగలవు.

చదరంగావుండేవి మొదట మంచిఫలితముకలగకపోయినా అఖరులోమంచిఫలితము నందివ్వగలవు.

ముక్కోణపు పుట్టుమచ్చలు మిశ్రమ ఫలితముల నందివ్వగలవు.

పుట్టుమచ్చలపై పలచగా వెంట్రుకలుండిన సంపద, కీర్తి,కలుగును.

దట్టంగావుంటేదరిద్రము,విచారముకలిగే అవకాశముంది.

## గుర్తుంచుకోవలసిన విషయములు

కొన్ని మంచి ఫలితములు, మరికొన్ని చెడు ఫలితముల నివ్వగలవు





చెడు ఫలితములురంగునుబట్టి నిర్ణయించుకోవాలి. కేవలం పుట్టుమచ్చని బట్టి నిర్ణయించరాదు.

మచ్చల శుభ, అశుభ ఫలితములు కొంతమేర వుంటాయి గానీ స్థాన బలము గొప్పది.

చెడ్డ మచ్చలు (నలుపురంగు మచ్చ) మంచి స్థానములో వున్నా చేకూరవలసిన శుభ ఫలితము 1/3 వంతు మాత్రమేనని గ్రహించాలి.

మచ్చ సైజు పెరిగే కొలదీ ఫలితము తీవ్రతరం గానూ- చిన్నమచ్చల వల్ల ఫలితము తక్కువగా వుంటుంది.

# పురుషులకు పుట్టుమచ్చల ఫలితములు

## తల

'సర్వేంద్రియాణాంచ శిరః ప్రధానం' అనే సూత్రం ననుసరించి అవయములలో అన్నింటి కంటే ప్రధానమైనది తల. తలపై వెంట్రుకలు ఉండును.

కుడివైపున ఉన్న పుట్టుమచ్చలు శుభసూచకము' పుట్టు మచ్చలు చాలా రకములుగా వుండును. అందులో కొన్ని నల్లమచ్చలు, చిన్న మచ్చలు, వెంట్రుకలు మొలచిన పుట్టు మచ్చలు, తేనెరంగు మచ్చలు, ఆకుపచ్చ మచ్చలు, ఎర్రమచ్చలు ఇలా ఎన్నో రకాల మచ్చలు మన శరీరంపై ఉండును.

ఈ పుట్టు మచ్చలు కొన్ని చిన్నవిగాను, కొన్ని పెద్దవిగాను ఉండును వీటిసైజును బట్టి కూడా ఫలితములో తేడా వుండును. ఆకుపచ్చరంగు, ఎరుపురంగు పుట్టుమచ్చలు ఉన్నచో శుభసూచకము. నలుపురంగు పుట్టుమచ్చలు ఉన్నచో అవమానము కలుగజేయును.

ఈ రంగు మచ్చలు చెడు స్థానములో ఉన్నచో ఫలితము కొంతభాగముతగ్గును. నల్లమచ్చల వలన అవమానములు కలుగును.

కాని అస్థానములో ఎరుపురంగు మచ్చఉండుటవలన ఆ అవమాన ముల నుండి తప్పించుకొనుట జరుగును.

చెడునుకలిగించుపుట్టుమచ్చలు మంచి స్థానములో నున్నచో మూడవ వంతు శుభము కలిగించును. అలాగే శుభము కలిగించు పుట్టుమచ్చలు చెడు స్థానములో ఉన్నట్లయిన నాలుగోవంతు, మూడవ వంతు చెడును అనుభవించవలసినదే.

తలపై భాగమున వెంట్రుకలు ఉండుట వలన పుట్టుమచ్చలు ఎక్కడ వున్నది తెలిసికొనుట కష్టము. వెంట్రుకలు మొలిచే చోట మచ్చలు వుండును. వాటిని పుట్టుమచ్చలు అని అనుకోరాదు. అందుచేత జాగ్రత్తగా చూడవలెను. నున్నగా గుండు గీసినపుడు మాత్రమే పుట్టుమచ్చలు స్పష్టముగా కనపడును.

## తలకుడిభాగమున

తలమీద కుడిభాగమున పుట్టుమచ్చయున్నచో చాలా మంచిది. రాజకీయ వ్యవహారములలో అనుభవము కలిగి ఉండి పదవి చేపట్టుట అవకాశము ఉండును. ఈ పుట్టుమచ్చ ఆకుపచ్చ, ఎరుపు, తేనె రంగులలో ఉన్న యెడల మంత్రి పదవికాని,దానికి సమానమైన హోదాగాని చేపట్టుదురు. రాజకీయ వ్యవహారములను విమర్శన చేసే శక్తి సామర్థ్యములు కలిగియుందురు. ఉపకారము చేయు మనస్తత్వము కలిగియుందురు. మంచి ప్రవర్తనతో మెలగి మంచిపేరును సంపాదించుదురు

ధనముసంపాదనలో వెనుకంజవేయక ధైర్యసాహస ములతో అందరి కంటే ఎక్కువ లాభమును సంపాదించుదురు. మంచి చోరవుండును. వ్యాపార సంస్థలకు గౌరవ పదవులు పొందుట జరుగును.చేతి నిండా డబ్బు పుష్కలముగా ఉండును. అనుకూల వతైన భార్య, వాహనయోగం మొదలగునవి కలుగును. జీవితంలో ఎల్లప్పుడు విజయాలు సాధించు దురు. మొత్తం మీద వ్యాపారస్థులకు చాలా మంచిది.





## తల ఎడమభాగమున

తల ఎడమభాగమునపుట్టుమచ్చ ఉన్న అపారమైన తెలివి తేటలు కలిగియుండి నలుగురిలో మంచిపేరు సంపాదించు దురు. సంసార విషయంలో వైరాగ్యం కలిగి వుందురు. ప్రకృతికి విరుద్ధంగా ప్రవర్తించెదరు. డబ్బుకు విలువయివ్వరు. ఒకచోట స్థిరముగా ఉండక దేశాటన చేయుదురు. జీవించడానికి ఏరకమైన లోటు ఉండదు. ఉన్నతమైన ఆదర్శములు కలిగి, వేదాంతిగా పేరు ప్రఖ్యాతులు సంపాదించుదురు. సంఘసేవ చేసి ఆదర్శవంతులు కావాలనే కోరిక కలిగియుందురు. ప్రతి విషయమును విమర్శచేయుచు ఆలోచనలతో పనులు చేయు చుందురు. సాహిత్యరంగములో ప్రవేశము ఉండును. ఎల్లప్పుడు శ్రీహరి పాదారవింద సేవా తత్పరులుగా ఉందురు. యోగా భ్యాసము చేయుదురు. యోగాభ్యాస ప్రచారకులుగా సన్యాసాశ్రమమును స్వీకరింతురు. జీవిత మంతయూ జితేంద్రియత్వములోనే గడిపి పేరు ప్రఖ్యాతులు పొందురు.

## తలవెనుక భాగమున

తల వెనకుభాగమున పుట్టుమచ్చ ఉన్న ధనసంపాదన విషయ ములో ఎటువంటి మార్గమునైనా అనుసరించు దురు. పరస్త్రీ వ్యామోహము కలిగియుందురు. అయిన ప్పటికీ భార్యపై అపారమైన ప్రేమ ఉండును. పేరు ప్రతిష్ఠల కన్నా డబ్బుకు ప్రాధాన్యత యిచ్చుదురు. పదిమందిలో పేరు ప్రతిష్ఠలు అంతగా వుండవు.

## తలముందు భాగమున

తల ముందు భాగమున్నఉన్న తెలివితేటలు, ఆలోచనాశక్తి ఎక్కువ,వ్యాపారరీత్యా లాభముఉండును. ధాన్యం వ్యాపారంబాగా అనుకూలించును. ఇతరుల మాటను లెక్కచేయరు. పట్టుదల ఎక్కువ. వ్యాపారరీత్యా ధనసంపాదన జరుగును. కుటుంబంలో సంతానం ఎక్కువగా ఉండును.

తలమీద పుట్టుమచ్చ స్పష్టముగా వంకరలులేక నునుపుగా ఉన్న యెడల గౌరవప్రతిష్టలు పెంపొంది, కనకాభిషేకము చేయించు కొనగల వారగుదురు. ధనలాభము కలుగును.

# నుదురు

నుదురుభాగము చాలా విశాలముగా ఉండుటచాలా మంచిది. ఆలోచనాశక్తి ఎక్కువ.ప్రతి విషయమును ఆలోచనా దృష్టితో చూచు చుందురు. వీరు సంఘములో పేరు ప్రతిష్టలు కలిగియుందురు. ఎట్టి సమస్యలనైనా సులభంగా పరిష్క రింతురు. వీరు ఏ విషయము ఆలోచించినా అనుకూలము కలుగును. సమయస్ఫూర్తిగా మాట్లాడు చుందురు. నుదుటి మధ్యభాగమున పుట్టుమచ్చఉన్నయెడల వారసత్వము వలన ధనసంపదలు ప్రాప్తించును. చదువుసంధ్యలందు మంచి ప్రావీణ్యము సంపాదింతురు.

నుదుటిభాగము చిన్నదిగా ఉన్న అట్టివారు సామాన్యముగా నుందురు.పెద్దలయెడల గౌరవ మర్యాదలతో మెలగియుం దురు. వీరిని గౌరవించువారు కేవలం మొక్కుబడి కొరకు మాత్రమే గౌరవించు దురు. ఎదుటి వారికి ఉపకారముచేస్తానని చెప్పిఅవసరమును బట్టి మారు చుందురు.

నుదుటిభాగమునందున్న పుట్టుమచ్చ ఏరంగు కలిగి ఉన్నా మంచి ఫలితంయిచ్చును.ఎరుపురంగుకలిగి వున్న ధనసంపాదన, ధైర్యసాహసము లు ఉండును. ఇతరులకు ఉపకారము చేయు గుణము కలిగి ఉండును.

## నుదుటి కుడిభాగమున

నుదిటి కుడిభాగమున ఎరుపురంగు పుట్టుమచ్చ ఉన్న మంచిది. నొసటి మధ్యనుండి కుడికణత వరకుఉన్న ప్రదేశము లో పుట్టుమచ్చ ఉన్నయెడల మంచి ఫలితములు కలుగజేయును. నొసలు విశాలముగా





నున్న ధన విషయంలో ఏవిధమైన లోటువుండదు. ఏదో విధము గా డబ్బుచేతికి వచ్చును. ఏవ్యాపారము చేసినను అచిర కాలములోనే అభివృద్ధిలోనికి వచ్చును. బంధువర్గములోని వారి యొక్క ఆదరాభి మానాలు పొందును. ఇతరులకు సహాయము చేయుచుందురు. తన తాలూకు వారికి వృద్ధిలోనికి తీసుకు వచ్చెదరు. దైవభక్తి,గురుభక్తి కలిగి యుందురు. పుట్టుమచ్చలు ఎంతస్పష్టముగా ఉన్న అంత ఫలితము యిచ్చును. నుదురు ఎంత విశాలముగా అంత సిరిసంపదలు ఎక్కువగా ఉండును. స్త్రీకి ఎరుపురంగు మచ్చఉన్నయెడల ఆమె భర్త మంచి సంపాదనాపరుడై ఆమెను సుఖపెట్టును. నలుపురంగు మచ్చఉన్నయెడల అహంకారముగల స్త్రీ అయిఉండును. భర్తను లెక్క చేయక తనయిష్టాను సారముగా ప్రవర్తించి, భర్తమాటను ధిక్కరించును.

## నుదుటి కుడిభాగము

నుదుటి కుడిభాగమున పుట్టుమచ్చ ఉన్న మంచిది కాదు. బంగారమును పట్టిన మట్టిఅగును. స్త్రీ విషయంలో అయిన తాను ఏపాపము చేయకుండా తనకు ఆపదలు ఎట్లు సంభవించె నోయని బాధపడు చుండును. తేనెరంగు మచ్చఉన్నయెడల ప్రపంచంలోని కష్టాలన్నీ తానే అనుభవించవలసి వుంటుంది. ముసలి తనములో సుఖములు పొందుదురు. నుదురు పైభాగమున పుట్టుమచ్చ ఉన్నచో క్రూర హృదయము కలిగి ఉందురు. వ్యాపారమునందు మంచి అను భవము కలిగి ఉందురు. విదేశీ ప్రయాణములు చేయుచుందురు. యితర దేశము లకు పోవుటవలన కష్టనష్టములకు గురిఅగుదురు.

నుదురు ఎంత విశాలముగానున్న అంతమంచిది. నుదుటిపై పుట్టు మచ్చ ఎంతస్పష్టముగా ఉన్న అంతకీర్తి, భక్తి,గౌరవ మర్యాదలు ఆ వ్యక్తిలో వుండును. ఇతరులు కూడా వీరిని గౌరవముతో చూచు చుందురు. నుదురు చిన్నదిగా ఉండి దానిపై పుట్టుమచ్చ ఉన్న ఫలిత ములు బాగానే ఉండును. ఎరుపురంగు పుట్టుమచ్చ ఉన్న ధైర్య సాహ

సాలు ధాతృత్వము కలిగి ఉందురు. కొంధరికి నుదుటిభాగమున పుట్టుమచ్చ ఉన్నయెడల దాని యొక్క ఫలితములు కొంత ఆలస్యముగా పొందుదురు.

# కనుబొమ

## కుడికనుబొమ

కుడికనుబొమపై పుట్టుమచ్చ ఉన్నచో చిన్నతనము నందే వివాహము జరుగును, అందం లేకపోయినా సంసారం చక్కగా తీర్చిదిద్దగల భార్య లభించును. భర్తపై గౌరవము, శాంత స్వభావము కలదిగా నుండును. వీరు భార్యయొక్క అదృష్టము వలనపైకి వచ్చెదరు. వీరు ఏదైనా వ్యాపారము చేయాలని తలపెట్టిన భార్యపేరుతో చేసిన అదృష్టము కలిసివచ్చును. స్థిరాస్థి వృద్ధి అగును. లాటరీలు ఫజిల్స్ మొదలగునవి భార్యపేరుతోనే కలసి వచ్చును. వీరికి చిన్నతనమునందే వివాహము జరుగుటవలన భార్యపై తప్ప పరస్త్రీల వ్యామోహముఉండదు (అనగా భార్యపై ఎక్కువ ప్రేమ అనురాగములు కలిగి ఉంధురు) భార్య సుగుణ వతి, ధనవంతురాలు ఐ ఉండును. భార్యకు కూడా వీరియందు గౌరవము, భక్తి ప్రేమానురాగములు ఉండును. సాంసారముపై విశేష ఆసక్తి ఉండును. శాంతస్వభావము కలిగి ఉండును. గ్రామ రాజకీయా లలో చక్కటితీర్పులు చెప్పగలిగిన మేధావులై ఉందురు. వీరు పనిచేయు సంస్థలో గౌరవమైన పదవులను పొందుదురు. సెక్రటరీ, ప్రెసిడెంట్ మొదలైన పదవులుమరియు కౌన్సిలరు, ఛైర్మన్ మొదలైన పదవులు పొందుదురు. కొన్ని ప్రయత్నాలు అప్పుడప్పుడు ఫలించకపోవచ్చును. వీటిని ఘోరప రాజయముల క్రింద లెక్క చేయనవసరం లేదు.

## ఎడమకనుబొమ

ఎడమ కనుబొమ మీద పుట్టుమచ్చఉన్నయెడల అతడు ధనవంతుడై ఉండును. సైకిలు, మోటారుకారు, మొదలైన వాహనాలు





కలిగియుండును. వీరికి అకస్మాత్తుగా వాహనముల వల్ల ప్రమాదములు జరుగును. వీరికి వ్యాపారరిత్యా కలిసిరాదు. అకస్మాత్తుగా ధననష్టం, నమ్మినవారివలనమోసములు, ఆపదలు కలుగును. ఏపని పూర్తిగా నెరవేరదు. జీవితములో ఆపదలు, అపవాదులు కలుగును. పూర్వీకులు నంపాదించిన ధనమును నద్వినియెాగవరచలేరు. క్రమేణా ఖర్చయిపోవును.

## రెండు కనుబొమల మధ్యభాగమున

రెండుకనుబొమల మధ్యపుట్టుముచ్చ ఉన్న చాలా మంచిది. ధనమునకులోటు ఉండదు. భార్యకు అభరణములు చేయించుదురు. ఇతరులకుతీర్పు చెప్పుటలో పక్షపాత బుద్ధి చూపక యితరులచేత మెప్పుపోందురు. విలాసవంతమైన వస్తువులు ఎక్కువ వాడుతారు. ఎలక్షన్లలో వీరు తప్పక విజయం సాధించెదరు. సుగంధద్రవ్యములు వాడుట,విలువైన వస్తువులు ధరించుటఅనిన వీరికి చాలాయిష్టము. హైక్లాసు సిగరెట్లను కాల్చెదరు. పరస్త్రీ వ్యామోహము కలిగి ఉందురు. ఇతరులకు అపకారము కలిగించే చెడు గుణములు ఉండును. ఏది ఏమైనా అదృష్టవంతులనే చెప్పవచ్చు. ఆయుష్షు ఎక్కువ. బంధు వర్గములో ఆదరాభిమానములను పొందు దురు.

పుట్టుమచ్చల విషయంలో పురుషులకు కుడి భాగమున స్త్రీలకు ఎడమ భాగమునుపాటింపవలెను. పుట్టుమచ్చలకు తిలకమని కూడా అందురు. తిలకమనగా బొట్టు అని అర్ధము. కొన్ని పుట్టుమచ్చలు బొట్టు పెట్టినట్లుగా ఉండును. అందుకని తిలకము అని కూడా అందురు. ఎర్రనిశరీరము, మీద మచ్చలనుశుభ్రముగా గుర్తించ వచ్చును. వాటి రంగు కూడా స్పష్టముగా తెలియును. నల్లని శరీరం మీద మచ్చలు గుర్తించుట కష్టము. పుట్టుమచ్చల రంగు విషయము నిదానముగా గుర్తించి ఫలితములను చెప్పవలెను.

ఎరుపురంగు మచ్చలను, స్థానబలమునుబట్టి ఫలితములను

చెప్పవలెను. ఆకుపచ్చరంగు ఉండిన శుభ ఫలము కలుగును. తేనెరంగు పుట్టుమచ్చ ఉన్న మధ్య మఫలితం, ఆకాశం రంగులోఉన్న సమాన ఫలితము, నలుపురంగు ఉన్న అశుభఫలితములు చెప్పవలెను.

# కణత

## కుడి కణత

కుడి కణతపై పుట్టుమచ్చఉన్నచో వారికి త్వరగా వివాహము జరుగును.అందమైనటువంటి భార్యలభించును. ఆధునిక అలవాట్లు గలస్త్రీ లభించును. సాంప్రదాయకమైన అభరణములు ధరించుటకు యిష్టపడని భార్య లభించును. భర్తను ప్రేమించుటలో తనకు తానేసాటి అను స్వభావమును కలదై ఉండును.

మంచిభార్య లభించుటేగాక, సంపదవిశేషముగా వచ్చే అవకాశముకలదు. వారసుల ఆస్తికలిసివచ్చును. స్వయంకృషితో ధనమును సంపాదించుటకన్నా లాటరీలవలన,వారసుల ఆస్తివలన వీరు ధనవంతులగుదురు. ఆకస్మిక ధనలాభం కలుగును.

## ఎడమకణత

ఎడమకణత పైపుట్టుమచ్చ ఉన్నా కుడికణతపై పుట్టుమచ్చ ఫలితమునే యిచ్చును. వీరికికూడా అనుకూలమైన భార్య లభించును. వీరికి లాటరీలో పెద్దబహుమతులకన్నా చిన్న బహుమతులను గెలుచుకుందురు. వీరికి వ్యాపారము కలిసి రాదు. నష్టమువచ్చును. ఈ పుట్టుమచ్చ ఉన్న వ్యక్తి ముఖము అందముగా ఉన్నప్పటికీ ఎదుటవారికి మంచి గుణము కల వ్యక్తిగా కనబడరు. మోసగాడని అనుమానించెదరు. వీరు మంచి పనులు చేయుటకు ప్రయత్నించినను. అదిచెడు ఫలితము లనే యిచ్చును. బంధువులయొక్క ఆదరాభిమానాలు తక్కువగా వుండును. యితరుల విషయములో ఎంత మంచిగా వున్నను, వారియొక్క తిట్లు, దూషణ మాటలు తగులుచుండును. కాని వీరు ఆబాధల నుండి విముక్తి





పొందలేరు. డబ్బు చేతిలో లేక యిబ్బంది పడుదురు. యితరులు తనను ఎందుకు చిన్నచూపు చూస్తున్నారో తెలియక బాధపడుదురు. తనకన్న తక్కువ శక్తి సామర్ధ్యములు కలవారు గౌరవింపబడుటచూచి తననెందుకు గౌరవించుటలేదో ఆలోచించెదరు. ఈ దిగులు విచారముతో మధ్యమధ్య ఆరోగ్యమును పాడుచేసుకొందురు. ప్రపంచములో న్యాయమునకు స్థానములేదనే భావన మనస్సులో స్థిరముగా ఉండును. మొత్తం మీద ఎడమకణతమీద పుట్టుమచ్చ ఉండుట మంచిదికాదు. దురదృష్టకరమైనదని అంగీకరించవలసిందే.

## కణతకు కనుబొమకు మధ్యభాగమున

కణతకు కను బొమ కు మధ్య భాగమున పుట్టుమచ్చ ఉన్న కొంత వరకు మంచిది. దూర దృష్టి తక్కువ. జీవిత విషయములో గాని ప్రయాణ విషయము లోగాని ముందు జరుగబోయేసంగతుల గురించి ఆలోచించుట తక్కువ. వ్యర్ధమైన ఆలోచనలతో టైము వృధా చేయుటకు యిష్ట పడరు. అనవసరమైన ప్లానులు వేయుట తక్కువ. సంపాదన విషయంలో లోటుఉండదు. వీరుఏదైనా పని చేయాలని తలపెట్టినముందుగాప్లానువేసిచేయుదురు. వీరికి ఆపనిఅయినా అవ్వవచ్చులేదా ప్రారంభంలోనే అంతరాయము కలుగవచ్చును. ఆ తర్వాత ఏంచేయాలని అనేది వీరికి కొంత కాలమువరకు తట్టదు. ఎడమపార్శ్వమున పుట్టుమచ్చఉన్న నిశ్చిత ఫలకార్యములందు ఆటంకము కలుగును.

సాధారణముగా పుట్టుమచ్చపెద్దదిగాను, గుండ్రముగాను ఉన్నశుభఫలితములు ఎక్కువగా ఉండును. శరీరమందు పుట్టు మచ్చలు కొన్ని చోట్ల చిన్నవిగాను, ఎక్కువగాను, ఉన్నయెడల అందు పెద్దమచ్చలనే గమనించి ఫలితములు చూసుకొనవలెను. కొన్ని పుట్టుమచ్చలవలన మనుష్యులయొక్క స్వభావసిద్ధమైన గుణభావములను తెలిసికొనవచ్చును. అలాంటిది పరిశీలనాశక్తి మీద అధారపడి ఉండును. ఇతర వ్యాధులచే శరీరమున అంకు రించిన మచ్చలను మందులచేగాని, మరి

ఏ యితర సాధనములచేతగాని పోగొట్టకొనవచ్చును. ఎన్ని ప్రయత్నములు చేసినను పుట్టుమచ్చలను పోగొట్టుట కష్టము.

# కన్య

సూ:-సవ్యనేత్రో విద్యార్జన పరోధన మేధావిని శాంత:

## కుడికంటిలో

కుడికంటిలో పుట్టుమచ్చ ఉన్న చాలా మంచిది. వీరుచేసే పనులలో ఆయాచితముగా అభివృద్ధి కనబడును. వీరు శ్రమపడినదానికన్న ఎక్కువ ఫలితమును పొందుదురు. ధన సంపాదన విషయంలో ఆలోచించ నవసరం లేదు. తప్పనిసరిగా ధనవంతుడగును. పేరు ప్రతిష్టలు, గౌరవ మర్యాదలు వాటంతట అవే వచ్చును. వీటిని సంపాదించుటకు వీరు శ్రమపడనవసరం లేదు. ఉన్నతపచ్చిన లేవి అన్నట్లుగా లేవిగానే బ్రతుకు తారు, అనుకోకుండా ధనం వచ్చుట. తాను సుఖపడుతూ, యితరులను సుఖపెట్టగల సమర్థుడై ఉండును.

ఈ పుట్టుమచ్చ నల్లగ్రుడ్డుకు కుడిభాగమున ఉన్న ధనము సంపాదించుటలో మంచినేర్పరితనము కలిగి ఉందురు. పేరు ప్రతిష్టలు, గౌరవమర్యాదలు సంపా దింతురు. పరాజయమన్నది తెలియదు. ధనము ను విలాసములకు ఉపయోగించుటలో వెనుకంజవేయరు. తాము దర్జాగా బ్రతకాలని, మోసముతో ఉండరాదని మంచి భావన కలిగి ఉందురు. అన్ని వర్గముల వారితోను స్నేహము చేయుదురు.తక్కువ ధనము సంపాదనపై ఆలోచింపక తనస్తోమతకు తగినట్లుగా ఎక్కువ ధనము సంపాదన గూర్చి ఆలోచించెదరు.

## ఎడమభాగము

ఈ పుట్టుమచ్చ నల్లగుడ్డుకు ఎడమ భాగమున ఉన్న మంచి గుణములు కలిగి ఉందురు. ప్రతి పని యందు విజయములను కలుగును.





ఈ పుట్టుమచ్చ నల్లగ్రుడ్డుకు క్రిందభాగమున ఉన్న కృషికి తగిన ఫలితమును పొందును. అదృష్టం కలిసి రావడంతక్కువ. అక స్మాత్తుగాలాభంరావడం లేకపోయినా స్వశక్తిపై సాధించిన ఫలితముల వలన పైకి వచ్చెదరు.

## కుడి కంటిరెప్పమీద పుట్టుమచ్చ

కుడికంటి రెప్పపై పుట్టు మచ్చ ఉన్న భాగ్యవంతుడై ఉండును. విపరీతంగా ధనము సంపా దించి ఇంట్లో సుఖసంతోషాలకు కాకుండా ఆడంబరములకు, సుఖసౌఖ్యములకు, ఫర్నిచర్లకు, బీరువాలు, రిఫ్రిజిరేటర్లు, మొద లగు సామానులు ఏర్పరచుకుందురు. తనయిల్లు అందము గా ఉండాలనే భావన కలిగి ఉందురు. అనుకొన్న పనినీక్షణాలపై జరి పించుకుందురు. వీరికి గర్వం ఎక్కువగా ఉండును.

దైవముపై నమ్మకము కలిగి ఉండి,యిది అంతయు దైవకృప అనే భావన కలిగిఉందురు. తన దృష్టిలో తాను గొప్పవాడినన్న భావన కలుగదు. ప్రతిరోజు పూజలు చేస్తుంటారు. దైవభక్తి కలిగి యుండుట వలన దేవుడికోసం ఖర్చుపెట్టి తనకంటే దైవభక్తి కలవారు ఎవరు అన్న భావన కలిగి ఉంటారు.అతని హోదాకు తగినట్లుగా పనులు కూడా అలాగే జరుగును.విచారం అనేది ఎరుగరు. విపరీతంగా ధనం ఖర్చు చేయుటకు వెనుకాడరు.

## కుడికంటిరెప్పలోపలి భాగములోపుట్టుమచ్చ :

కుడికంటి రెప్పలోపలిభాగమున పుట్టుమచ్చ ఉన్న ధనమునకు లోటు ఉండదు. తరగని ఆస్తి కలిగి ఉందురు. ఏది పట్టుకున్నా అది బంగారమగును. కార్లు, భవనాలు, ఆభరణములు, విశేషధనము కలిగి ఉందురు. తన స్థితికి తగినట్లుగా వ్యవహరింతురు. దైవభక్తి ఉండును. దేవునికి నగలు చేయించుదురు. దైవకార్యముల విషయములో తనకు తోచిన సహాయము చేయుదురు. దైవకార్యములలో గౌరవ పదవులు పొందుదురు. తానే కాకుండా తన యింటిలోని వారి అందరిపైన తనలో

ఉన్న భక్తి భావము ప్రసరింపజేయును. యితనిని చూచి యిటువంటి భాగ్యవంతుని ధనము కొంతైనా మనకు వచ్చిన బాగుండుననే భావన కలిగేటట్లుగా కనిపించుచుదురు.

## ఎడమకంటిలో గ్రుడ్డునకు కుడిభాగమున :

ఎడమకంటిలో గ్రుడ్డునకు కుడిభాగమున పుట్టుమచ్చ ఉన్న భార్యకాక యింకొక స్త్రీని ఉంచుకొందురు. స్త్రీ వ్యామోహం ఎక్కువ. తనకున్న ఆస్తిలో కొంత ఆస్తిని మరొక స్త్రీకి ధారపోసి నష్టపోవును. తన ఆస్తి అంతాపొగొట్టుకొన్న తర్వాత ఆ స్త్రీ యితనిని వదిలిపెట్టుటచే మనోవిచారముతో కృంగిపోవుదురు. చివరకు ఆస్తిని పోగొట్టు కొని జీవితముగడుపుటకై ధనసంపా దనకు ప్రయత్నించును. యితర పుట్టుమచ్చల ఫలితముల వలన కష్టములనుండి తొలగుదురు. దైవము అనుకూలించక చెడు జరుగును.

## ఎడమకంటిలో గ్రుడ్డుకు ఎడమవైపున

ఎడమకంటిలో గ్రుడ్డుకు ఎడమవైపున పుట్టుమచ్చఉన్న ఎవరినిలెక్కచేయ మనస్తత్వము కలిగియుందురు. బంధువులచే మెప్పు పొంద వలెననే కోరిక ఉండదు. భార్యమాటలెక్కచేయక విచ్చలవిడిగా ధనమును ఖర్చుచేయుదురు. మొండిగా జీవితమును గడుపు చూ, భార్యపై కోపించుచూ,ఎవరిమాటను లెక్కచేయక చివరకు కష్టముల పాలగదురు. ఎవరిసానుభూతి, దయలపై ఆధారపడి ఉండరు. ఇతరుల ఆదరాభిమానములు పొందవ లెనని కోరిక ఉండదు. తన కష్టాలలో ఎవరి సహాయం పొందక తానే పొందుట జరుగును.

## ఎడమకంటిరెప్పపై భాగమున

ఎడమకంటిరెప్పపై భాగమున పుట్టుమచ్చ ఉన్నవారిలో కొందరికి ధనసంపాదన బాగు గా ఉండును. మరికొందరికి లక్షలు పెట్టుబడితో వ్యాపారము చేసిన వేలపై లాభం రావడం కూడా కష్టంఅవును. వీరికి





గర్వము ఎక్కువగాఉండును. వీరి గర్వముఅణచవలెనని యితరులు ప్రయత్నింతురు. వీలగర్వమేవీరినిపాడుచేయును. వీరు ధర్మం గాను, న్యాయంగాను మాట్లాడిన ఎదుటివారికి అది అధర్మంగానే తోచును. ధనధాన్యములకు లోటులేకుండా గౌరవ మర్యాదలతో జీవితమును గడుపుదురు. శరీరములో వేరొకచోట ఎక్కడా పుట్టు మచ్చలు లేక ఎడమకంటిరెప్పపై మాత్రమే పుట్టుమచ్చ ఉన్న అపకీర్తి, అపజయం కలుగుచుండును. ఒకవేళ యితర పుట్టు మచ్చలు ఉన్న వాటి ఫలితాలు, ఈ ఎడమకంటి రెప్పపై ఉన్న పుట్టు మచ్చ ఫలితమును త్రోసిపుచ్చవు. మొత్తం మీద ఈ పుట్టుమచ్చ ఉండుట అంత మంచిదికాదు. మంచి ఉన్నత స్థితిలో ఉన్న వారు కూడా నీచ స్థితికి దిగజారటం జరుగుతుంది. వీరికి నీటిగండం కూడా కలుగును.

## ఎడమకంటిరెప్ప లోపలి భాగమున

ఎడమకంటిలో కొలకులో పుట్టుమచ్చ ఉన్న కోపంఉండదు. వీరికి బంధు వర్గము తక్కువ. ధనధాన్యములు, స్థిరసంపాదన ఎక్కువగా ఉండును. భార్యా పిల్లలపై ఎక్కువ ప్రేమ అభిమానము కలిగి ఉందురు. ఎదుటివారి తప్పులను క్షమించును. ఈ పుట్టుమచ్చ ఉన్నవారు తక్కువ కాలములో మరణింతురు. ఆకస్మిక ప్రమాదములకు లోనై అకాల మరణమును పొందును.

## ఎడమ లేక కుడికన్ను చివరి భాగమున

కంటిచివర, కనుగుడ్డు అంచుకు,కణతకు మధ్యభాగము న పుట్టుమచ్చఉన్న ధైర్యసాహసములు కలవారై ఉందురు. లక్షాధికారి కాకపోయినా ఆర్థిక యిబ్బందులు లేక ఉందురు. వీరు తలపెట్టిన దానికన్న వ్యతిరేకముగా పనులు పూర్తి అగును. మనసులో తానొకటి తలచుకుంటే వేరొకటి జరుగును. ఏదైనా పనిచేయుటకు తలపెట్టిన ఆపని చేయుటకు ముందు వెనుకలు ఆలోచించుట జరుగదు. తనకు తోచిన రీతిగా చేయును. ఏ రోగము లేకపోయినను ఆకస్మిక మరణము సంభ

వించును. తగవులు, దెబ్బలాటలలోగాని, రోడ్డు ప్రమాదములలోగాని మరణము సంభవించును. పార్టీ కక్షలలోగాని, తగవులాటలలో మరణము సంభవించును.

## కన్నీరు కారేచోట పుట్టుమచ్చ ఉన్నయెడల

ఏ కంటి కైననూ కన్నీరు కారేచోట పుట్టుమచ్చ ఉన్నదో ఎల్లప్పుడూ విచారముగాఉందురు.యిట్టి విచారము వ్యాపారములో నష్టము వలనగానీ,చేతికిఅందివచ్చిన సంతానము నష్ట మగుట వల్లగాని బంధువర్గములోముఖ్యమైనబంధువులు మరణించు టవల్లగాని ఏర్పడును. ఆ బాధచే ఎక్కువగా కృంగిపోవుదురు.

## క్రిందకనురెప్ప లోపలిభాగమున (రెండింటియందు)

క్రిందకనురెప్పలోపలిభాగమునపుట్టుమచ్చ బంధువులు ద్వేషించుట జరుగును. సంసార సౌఖ్యములపై విరక్తి కలిగి ఉందురు. యింట్లో భార్యా పిల్లలపై విసుగుపుట్టును. అగౌరవము జరుగుట తన జీవితములో సహజమని వీరుభావింతురు. సంపాదన తక్కువ ఖర్చులుఎక్కువ అగును. ఇంటి నుంచి డబ్బు తీసుకువెళితే అది యింటికి తిరిగి రాని ఖర్చులకై వినియోగింతురు. అనగాచేతిలో డబ్బు నిలవదు. నుదుటిమీద కను రెప్పలపై, కణతలపై కంటిలోపలిభాగములపై కాక మిగిలినచోట్ల అట్టి మచ్చలుఉన్న యెడల ఫలితములు చెప్పుకోదగినవికావు.

## ముక్కు

ముక్కు లావుగా ఉన్నచో అధిక మాటకారి. భోళాభాళీతనం కలిగి ఉండును.సన్నటిముక్కు చిన్న నాసికారంధ్రాలు కల వారు,తెలివితేటలతో గుప్తముగా మాట్లాడుదురు. కాని వారి మాటలలో తెలివితేటలు గోప్యత జాగ్రత్త కనపుడును.

**ముక్కు చివర: సూ ॥ నాసికా యాం కార్య సాఫల్యం ధీరః శాస్త్ర విశారదశ్చ॥**

ముక్కు చివర పుట్టుమచ్చ ఉన్నచో చురుకైన తెలివితేటల,





ఆలోచనాశక్తి ఎక్కువగా కలిగి ఉందురు. ఏ పనిచేసినా తొందరగా చేయుదురు. నిముషాలు మీద చేయును. కోపం అధికముగా ఉండును. తలచిన కార్యము పూర్తి అయ్యేవరకు పుట్టుదలతో చేయుదురు. యితరులనులెక్కచేయరు. తనవారి నందరిని తనచెప్పుచేతలలో అంటే తనమాట వినేటట్లుగా ఉంచు కొందురు. మొండిపట్టు ఎక్కువ. తప్పుని తప్పుగా ఋజువు చేయు వరకునిద్రపోరు. అభిమానం, ఆత్మగౌరవము తక్కువ, ఏపనిలో నైనా ప్రవేశించిన దానియందు ప్రావీణ్యత సంపాదింతురు. యితరుల గొప్పతనము గురించి ఎవరైనా చెప్పిన వారిని చులకన చేయుదురు. మాటకారితనము ఉండును. ధనధాన్యములు అభివృద్ధిగాఉండును. స్థిరాస్థిని అభివృద్ధి చేయును. గర్విష్టి కావడం వల్ల అప్పుడప్పుడు యిబ్బందులకు గురి అయిననూ వాటి నుండిఅవలీలగా బయటపడగల వారగుదురు.

## ముక్కుకి కుడిభాగమున

ముక్కుకి కుడిభాగమున పుట్టు మచ్చ ఉన్న కష్టపడి పనిచేయు శక్తి సామర్ధములు కలిగి ఉందురు. చూస్తుండగానే ధనవంతుడు కాగల అవకాశము కలదు. కృషికి మించిన ఫలితమును పొందును. దూరదృష్టి కలిగి ఉందురు. మొదట సామాన్యవ్యక్తిగా నున్న మిక్కిలి అభివృద్ధిలోకి వచ్చును. ఏ పనిప్రారంభించినా మధ్యలో అదృష్టం కలిసివచ్చి పైకి వచ్చెదరు. సంపదకలిసి వచ్చిననూ ఎంతో కాలమునిలువక వచ్చి పోయినట్లుగాపోవును.

## ముక్కుకి ఎడమభాగమున

ముక్కుకి ఎడమ భాగమున పుట్టుమచ్చ ఉన్న మంచిదికాదు. పరస్త్రీల యందు ఆసక్తి ఎక్కువ. చేతిలో డబ్బు బజారు పాలై పోవును. ఆదాయము మించి ఖర్చులు చేయుదురు. భార్యతో సంతృప్తి చెందక పరస్త్రీ వ్యామోహములో పడెదరు. నీచమైన స్త్రీలతోను, తన అంతస్థుకు సరితూగని స్త్రీలతో సంబంధము కలిగిఉందురు. అప్పుడప్పుడు వారి వలన ధన సంపాదన కూడా చేయుదురు.

## ముక్కుకి క్రింద భాగమున

ముక్కుకు క్రింద అడ్డకమ్మిపై పుట్టుమచ్చ ఉన్న మంచిది కాదు.ఏ పనియందు స్థిరత్వము ఉండదు. యితరుల బాధలను చూచి జాలిపడుదురు. ధన విషయంలో యిబ్బందులు పడు చుందురు. దుబారా ఖర్చు ఎక్కువ. ఎంత ప్రయత్నించి ననూ స్థిర ఉద్యోగము దొరకక, సరియైన ఆదాయము లభించక బాధలకు గురిఅగుచుందురు. ఒడిదుడుకులతో జీవితము గడుపవలసివచ్చును. తన యొక్క అజాగ్రత్త వలన తనను నమ్ముకున్నవారిని చిక్కులలో పడే లాగును చేయు చుందురు.

## ముక్కునకు మొదట

ముక్కునకు మొదట అనగా అడ్డ కమ్మి ప్రారంభములో మచ్చ ఉన్నయెడల మంచిది. స్థిరాస్థిని సంపాదింతురు. చదువు కున్న వ్యక్తి అయిన ఉద్యోగప్రాప్తి ఉండు ను. వ్యాపార వ్యవహారము అందు ఆరితేరి ఉండును. ఏ పని ప్రారంభించినా అదృష్టము కలిసివచ్చును. చక్కనిభార్య మంచి సంతానము కలిగిఉందురు. సర్వసుఖాలు అనుభవించ గలరు. యింతా సుఖాలు అను భవించలేకపోయాననన్న అశమిగులును.

## ముక్కుపుటల అడుగున

ముక్కు పుటలకు అడుగు భాగమున పుట్టుమచ్చ ఉన్న చాలా మంచిది. వీరు ఎల్లప్పుడు అందముగాను, ఆకర్షణీయము నగాను కనిపించుటకు ప్రయ త్నించుదురు. వీరు ఏభాషలోనైనా ప్రావీణ్యము సంపాదించిన దానిలో అనర్గళముగా మాట్లాడేశక్తి సామర్థ్యములు కలిగి ఉందురు. మంచిఉద్యోగము, అనకూలమైన భార్యలభించును. వీరు ఆదర్శవంతమైన జీవితము గడుపుదురు. ముక్కు రంధ్ర ముల యందుపుట్టుమచ్చ ఉన్న మనస్థాపము, దుఃఖము కలుగును.

## ముక్కుకు సమీపమున

ముక్కుకు సమీపమున పుట్టు మచ్చ ఉన్న వ్యాపార , వ్యవహారము-





లందు ఆరితేరిఉండును. వ్యాపారంకలిసివచ్చును. స్థిరాస్థిని సంపాదింతురు. పరస్త్రీల యందు ఆసక్తిని కలిగిఉందురు. స్త్రీల విషయం లో డబ్బుబాగుగా ఖర్చు చేయుదురు. పరిమళద్రవ్యములను వాడుచుందురు. విలాసవంతమైన జీవితముపై ఎక్కువ ఆశకలిగి ఉందురు. ఎదుటివారికి డాబుగాను,దర్పముతోను కనిపించులాగున వ్యవహరింతురు. కుటుంబసంతానం అభివృద్ధి కలిగిఉండును. సంతానము, విద్య, వినయవిధేయతలు కలిగి మంచి అభివృద్ధిలోనికి వచ్చుదురు.

# గడ్డం

గడ్డమునందు పుట్టుమచ్చ ఉన్న ధనాభ్యుదయము, గౌరవాతి శయములు కలుగును.

## గడ్డానికి క్రిందభాగమున

గడ్డానికి క్రిందభాగమున పుట్టు మచ్చ ఉన్న సమయస్ఫూర్తి, మాటకారితనము,విజ్ఞత యితరులకన్న ఎక్కువగా ఉండును. ఎదుటివారిని తనయొక్క తెలివితేటల తోను, మాటలనేర్పరితనముతోను వశ పరచు కుందురు. సంగీతమనిన వీరికి యిష్టము. సంగీతముద్వారా ధనము, పేరు ప్రతిష్ఠలు సంపాదింతురు. సాహిత్యము నందు కూడా అనుభవము కలిగి ఉందురు.

## కుడి ప్రక్కన

గడ్డమునకు కుడి ప్రక్కన పుట్టుమచ్చ ఉన్న చాలా మంచిది. మాటకారి తనము ఉండును. తన చెప్పిన దానిని ఎదుటివారిచేత అవునని ఒప్పించేంతటి తెలివితేటలు ఉండును. ఏ విషయమునైనా లాజికల్‌గా చెప్పును. ఈ పుట్టుమచ్చ లాయర్లకుగాని, రాజకీయ వేత్తలకు గాని ఉన్న మంచిపేరు, కీర్తి ప్రతిష్ఠలుసంపాదించి అభివృద్ధిలోనికి

వచ్చుదురు. అట్టి వ్యక్తి దయార్ధహృదయుడై ఉండును. యితరులను నొప్పించకుండా మాట్లాడును. నల్లటిపుట్టుమచ్చ ఉన్న సామాన్య, ధనవంతుడగును. అదే ఎర్రటిమచ్చ అయితే లక్షలకు లక్ష సంపాదింతురు. ధనవంతుడు, కీర్తివంతుడు, మాటకారికాగల లక్షణాలు యీ పుట్టుమచ్చవలన ఏర్పడును.

## ఎడమప్రక్కన

### సూ: వామే మాతృభేదై: పారదారికః:

గడ్డానికి ఎడమభాగమున పుట్టుమచ్చ ఉన్న అంతమంచిది కాదు. అనవసరమైన విషయములలో కలుగజేసుకొని యితరుల తో శతృత్వము తెచ్చుకొనును. ఎంత సొమ్ము సంపా దించిన వృధాఖర్చులు అగు చుండును. విద్యా విషయమున ఆసక్తి తక్కువగా ఉండును. స్వల్ప విద్య కలిగిఉందురు. చేతిలో డబ్బు నిలువదు. దుబారాఖర్చులు ఎక్కువగా చేయుదురు. సరిఅయిన సమయానికి డబ్బు చేతికి అందక యిబ్బంది పడుదురు. మాతృప్రేమ తక్కువ. పరస్త్రీల యందు ఆసక్తి కలిగిఉందురు. అందరిచేత అగౌరవము పొందుదురు.

## గడ్డానికి కుడిఎడమల మధ్య :

ఇ:- గడ్డానికి మధ్య పుట్టుమచ్చ ఉన్నచాలా మంచిది. మంచి ఫలితము యిచ్చును. ఏ విషయమునైనా న్యాయము గా మాట్లాడుచుందురు. న్యాయం కోసం ప్రాణాల్ని యివ్వడానికి కూడా వెనుదీయరు. డబ్బు సంపా దించుటలో మెలుకువ, మంచితెలివితేటలు కలిగి ఉందురు. ఒకరిని చూసి తాను అనుసరించుట తెలియదు. తనకు తోచినట్లుగాప్రవర్తించురు. పదిమంది లోను మంచిని సంపాదింతురు. ఈ మచ్చ నల్లగా ఉన్నచో జైలుశిక్ష అనుభవించుదురు. అప్పుడప్పుడు భయము కలుగుచుండును. గడ్డమునకు దిగువ భాగమున ఎచ్చట యున్న నూ సంగీతసాహిత్యము లందు ప్రావీణ్యుడై ఖ్యాతినార్జించును.





గడ్డము గుండ్రముగా నున్ననూ, నన్నముగా నున్న నూ ధైర్యసాహసములు ఎక్కువ. కాని మనోగర్వము ఎక్కువగా ఉండి సాడయిపోవును. ఇతరులు చెప్పిన దానిని వినరు. తనకు ఎంతతోచిన అంతేయని వ్యవహ రించుదురు.

గడ్డము ముడతలు పడిఉన్నచో తరచుగా అనా రోగ్యము కలుగు చుండును. ఆరోగ్యము సామాన్యముగా ఉండును.

# పెదవులు

## పై పెదవి

పై పెదవిపై పుట్టుమచ్చ ఉన్న చాలామంచిది. తనచేతులు మీదుగా శుభకార్యములు చేయించుదురు. అందరి చేత మెప్పును, ప్రేమను పొందుదురు. అందరికి తలలోనాలుక లాగాఉండి, తనఅవసరములు గడుపుకొనుచుందురు. మంచి వస్తువు లందు ఆసక్తి, కామభోగము లందు చతురతకలిగి ఉందురు. చాటుమాటుగా వ్యభిచారము చేయుదురు. సుఖ రోగములను గూర్చిన వైద్యశాస్త్రము నందు ప్రావీణ్యత ఉండును. అందరితో సఖ్యతగా ఉండి తన అవసరములు తీర్చుకొను చుందురు. ఆధునిక వస్తువులపై మక్కువ ఎక్కువ. తనయొక్క నగినగాలు, వస్తువులను అందముగా ఆకర్షణీయముగాను ఉంచుకొనును. వివాహ సంబంధములు కుదుర్చుట, శుభకార్యములు జరిపించు టయందు ఆసక్తి ఎక్కువగా ఉండును. తనకుయిష్టమైన కార్యములు చేయుచుందురు. విద్యా ప్రాప్తి కలదు.

## క్రింద పెదవిపైన

### సూ॥ లోభీస్యాదధరే తిలక :

క్రింద పెదవిపై పుట్టుమచ్చ ఉన్న హరికథలుచెప్పుట, పురాణ శ్రవణము మొదలగు వాటిలో ప్రావీణ్యత ఉండి, వాటిద్వారా ధన

సంపాదన చేయుదురు. సినిమాలలోగాని, నాటకాలలోగాని పాత్రలు ధరించే అవకాశము కలదు. అత్యంత భోజన ప్రియ త్వము ఉండును. నటనలో నేర్పరితనము ఉన్నా, లేకపోయినా మంచివాడు అన్న పేరు సంపాదిస్తారు. లోభత్వము ఉండును.

## పై పెదవి లోపలిభాగమున

పైపెదవి లోపలిభాగమున పుట్టుమచ్చ ఉన్న మంత్ర శాస్త్రము అందు ప్రజ్ఞ కలిగి ఉండును. తేలు, పాము మంత్రములందు పేరు ఉండును.

## క్రింద పెదవిలోపలిభాగమున

క్రిందపెదవి లోవలి బాగమున వుట్టుమచ్చ ఉన్న అంత మంచిదికాదు. వ్యసనముల రీత్యా ధనవ్యయం చేయుదురు. గంజాయి, మద్యము మున్నగు మత్తు వదార్థములను సేవించుచుందురు. సంఘములో మంచిపేరు ఉండును. తాత, ముత్తాతలు సంపాదించిన పేరు ప్రతిష్టలకు అపకీర్తి తెచ్చును. న్యాయం, ధర్మముపై విశ్వాసం తక్కువ తనకు తోచిన విధముగా ప్రవర్తించును. పదిమంది దూషించినా సరే వారి మాటను లెక్కచేయక తిరుగుచుండును. దుర్దానములను పరిగ్రహించి,నీచుడని పించుకొనును.

## చెక్కిళ్ళు

సూ॥కపోలే సుషమాయుక్తః హస్వర్థోనాగమంచ బహుపుత్రికః॥

చెక్కిళ్లయందు పుట్టుమచ్చ ఉన్నస్వల్పధనవంతుడగును. దారిద్ర్యము ఉండదు. పుట్టినపుడు ధనాదాయము ఏ స్థితిలో ఉండునో మరణించు నపుడు కూడా అదే స్థితిలో ఉండును. అనగా పెద్ద ధనవంతుడుగాని, కడునిరుపేదగాని అవడు.





## కుడిచెక్కిలి

కుడి చెక్కిలి మీద పుట్టుమచ్చ ఉన్న మంచిది. వీరు పుట్టుకతోనే ధనవంతులైఉందురు. ఏ విధమైన కష్టములు వీరికి తెలియవు. సున్నిత స్వభావము కలవారగుదురు. తనకు కష్టం వచ్చిన ఎదుటివారికి కష్టం వచ్చిన వీరు భరించలేరు. యితరులను నొప్పించరు. మానసికముగా కృంగిపోవుదురు. బంధువర్గములో మంచి పలుకబడి, పేరు ప్రతిష్టలు సంపా దింతురు. వయస్సు వచ్చు వరకు తల్లిదండ్రులుందురు.

## ఎడమచెక్కిలి

### కులాభివామే మధువర్ణం ప్రియవాగర్థ వటు.

ఎడమచెక్కిలిమీద పుట్టుమచ్చ ఉన్న మంచిదికాదు. తనను ఎవరో ఏదో అన్నారని బాధవడిపోవుదురు. చిన్న విషయమును పెద్దవిషయముగా ఊహించుకుందురు. సామాన్యకుటుంబము లో జన్మించును. చిన్నతనమునుండిఆర్థికయిబ్బందులకు గురి అగుదురు. తల్లి దండ్రులవలన లాభించే యోగములు తక్కువ. తల్లితండ్రుల రీత్యా ధనము ఖర్చగును. బంధువర్గము వారితో కలిసిమెలిసి ఉందురు. తల్లిదండ్రులు అనారోగ్యముగా ఉందురు. వీరు తరచు ఆర్థిక యిబ్బందులకు గురిఅగుదురు.బంధువుల సహాయము కోరరు. బంధువులతో విరోధముగా ఉండును. భార్యపై కోపగించుగుణము కలవాడుగా నుండును. అయి నప్పటికీ భార్య పై ప్రేమ అనురాగము కలిగిఉందురు. వయసు మీరన తర్వాత వివాహము జరుగును. కుటుంబములో అనవసర ఖర్చులు చేయకముందు విషయములోను చిరాకు కలిగి ఉందురు. వీరికన్న వీరికి పుట్టిన పిల్లల ధనము సంపాదించి మంచి పేరు ప్రతిష్టలు కలిగి ఉండి వీరిని సుఖ పెట్టుదురు. ఈ మచ్చ తేనె వర్ణము కలిగిఉన్న మంచి మాటలతో ధన సంపాదన చేయుదురు.

## కుడిచెక్కిలికి, చెవికి మధ్య :

సూ॥ గండయోర్భోగంచ దుర్యశః

కుడిచెక్కిలికి చెవికిమధ్య పుట్టుమచ్చ ఉన్న మంచి తెలివి తేటలు కలిగిఉందురు. బాల్యదశ యందు వీరికి తక్కువ సంపద ఉండును. వీరికి తెలివితేటలు ఎక్కువగా ఉండును. చదువుబాగా వచ్చును. గర్వముకొద్దిగ, అభిమానము ఎక్కువగా ఉండును. యితరులు చెప్పిన ప్రకారమునడచుకొనుటకు నామార్థా పడుదురు. అభిమానము అడ్డువచ్చును. యితరులు మంచి విషయము చెప్పినా అభిమానం అడ్డువచ్చి తనకు తోచిన విధముగా ప్రవర్తించును. న్యాయం, ధర్మం గురించి యితరుల విషయంలో ఉపన్యాసము యిచ్చినా తన విషయంలో మాత్రం తటస్థంగా ఉండును. సంపాదన బాగానే ఉండును. దానికి తగినట్లుగానే ఖర్చు ఉండును. మధ్య వయస్సు వచ్చే సరికి ధన సంపాదన కలుగును. వయస్సు మళ్ళుతున్న కొద్ది ధన సంపాదన కూడా తగ్గును. చాలాకాలము జీవించును. ముసలి తనము వచ్చు సరికి న్యాయన్యాయ విచక్షణ, తగవులు తీర్చుట యందు అనుభవము కలిగి ఉందురు. యితరులతో దెబ్బలాడు స్వభావము లేనివారిగానుందురు. మధ్య వయస్సులో ధన సంపాదన బాగా ఉండును. వీరికి ముసలితనము, చిన్నతనము ఒకే విధముగా ఉండును.

## ఎడమచెక్కిలికి, ఎడమచెవికి మధ్య

ఎడమచెక్కిలికి, ఎడమచెవికి మధ్యపుట్టుమచ్చ ఉన్న బీద స్థితిలో ఉందురు. విద్యా విషయములో ఆసక్తి ఉన్నప్పటికీ ఆర్థికస్థోమత తక్కువగా ఉండుటవలన బాగాపైకి వచ్చుట కష్టము. చిన్నతనమునందు ధనాదాయము తక్కువగా ఉండును. చిన్నతనమునుండి కుటుంబపోషణ గురించి ఉద్యోగములో ప్రవేశించుదురు. బాధ్యతాయుతముగా ప్రవర్తించుదురు. క్లుప్తముగా జీవితమును గుడుపుదురు. యితరుల





విషయాలలో జోక్యము చేసికొనరు. తన విషయములో యితరులను జోక్యము చేసికోనివ్వరు. కాని పెద్దలు సంపాదించినంతగా ధనమును సంపాదించలేరు. జీవితమంతయూ కష్టముతో నిండి ఉన్నట్లు తెలిసికొందురు. సంతానం ఎక్కువ.

# చెవులు

సూ॥కర్ణే విమల కీర్త్యర్థం సౌఖ్యం సద్భూషణ మానంద శ్రవణంచ

రెండు చెవులమీద రెండు పుట్టుమచ్చలు ఉన్నవారికి చిన్నతనమునుండి ధన విషయములో ఏ విధమైన లోటు వుండదు. ఆగర్భశ్రీమంతుడై ఉండును. తనకంటే గొప్పవారు లేరనే భావన కలిగిఉందురు. వీరుమాట్లాడిన మాట న్యాయమని పలువురచే పొగడబడుదురు. డబ్బును మంచినీళ్ల ప్రాయముగా ఖర్చు పెట్టుదురు. డబ్బువల్ల యితరులను తన చెప్పుచేతలతో ఉంచుకొనును. మాట్లాడేమాటలు గర్వముతో కూడి ఉండును. గర్వముతో యితరులపై అధికారము చెలాయించుదురు. అనేక గౌరవపదవులను పొందుదురు. రాజకీయములో పేరు ప్రతిష్టలు కలుగును. శతృవులు ఉన్నప్పటికీ వీరిని ఎవ్వరూ ఏమీ చెయ్యలేరు. ప్రపంచమంతటా పేరుప్రఖ్యాతలు సంపాదించురు.

## ఏ చెవి వెనుకనైనా :

సూ॥ యస్మిన్ కస్మిన్నపి కర్ణే పశ్చార్థగౌ తిలకం సదాచార ప్పన్మా నంచయశః కీర్తిద్వి ద్యాలాభం ధనాగమః॥

చెవులవెనుక పుట్టుమచ్చ ఉన్న చాలా మంచిది. అన్ని విధాలా అనుకూలవతియైన భార్యలభించును. చీకుచింతాలేక జీవితము ను గడుపుదురు. సకలగుణవంతురాలైన భార్యదొరికి తన యొక్క పనులలో ఎప్పుడు సహాయకారిగా ఉంటుంది. తండ్రి సంపా దించిన ఆస్తివలన

చిన్నతనమునుండి డబ్బుకు ఏవిధమైన లోటు వుండదు. దీర్ఘాయుర్దాయము ఉండును. సునాయాసమరణము సంభవించును. భార్యను సుఖపెట్టుటకు తాను బాగా శ్రమ పడును. ఆదర్శదంపతులై అన్యోన్య జీవితము ను గడుపుదురు. అనారోగ్యాలు తక్కువ.

## కుడిచెవికొనమీద

కుడిచెవికొనమీద పుట్టుమచ్చ ఉన్న తల్లిదండ్రుల ఆస్థిని పొందుదురు. మాటకారి, యితరులను సూటిపోటీమాటలతో బాధపెట్టును. యితరుల వలన మాట పడరు. నీటిగండము కూడా కలదు. భయస్తులై ఉందురు. అందరితో కలసిమెలసి ఉందురు. తక్కువమందితో స్నేహము చేయుదురు. జీవితంలో సాధించినది బహుతక్కువ. ఏ విధమైన కష్టములు లేక జీవితమును గడుపుదురు. సౌఖ్యవంతముగా ఉందురు.

## ఎడమచెవికొనమీద

ఎడమచెవి కొనమీద పుట్టుమచ్చ ఉన్న ధైర్యశాలి, పరస్త్రీ వ్యామోహము ఎక్కువ. జీవితంలో ఎక్కువ భాగం స్త్రీ సౌఖ్యం కోసం వినియోగించును. తరచుగా సుఖ వ్యాధులు వలన బాధలు పడుచుందురు.

## కుడిచెవి క్రింద భాగమున

కుడిచెవి క్రింద భాగమున పుట్టుమచ్చలు ఉన్న తాతలు సంపాదించిన ఆస్తులు కలసిరావు. స్వయం సంపాదనకై కుటుంబమును పోషించవలసి వచ్చును. అప్పులపాలగుదురు. సంపాదన కలిసిరాదు. అయినా సరే తిండికి బట్టకు లోటురాదు. సంసారము సుఖప్రదముగా సాగును.

## ఎడమచెవి క్రిందభాగమున

ఎడమచెవికి క్రిందభాగమున పుట్టుమచ్చ ఉన్న మంచిదికాదు. సంసారముసాగించుట కష్టము. శక్తి సామర్థ్యములు కలిగి ఉండికూడా ఏమీచేయులేకపోవుదురు. ఆత్మాభిమానము ఎక్కువగా ఉండుటవలన [illegible] పొరపాట్లు చేయరు. యితరులు పొరపాటు చేయుట సహించరు. జీవితము గడ్డుగా గడుచును.





# నాలుక

## నాలుక చివరిభాగమున

నాలుకచివరిభాగమున పుట్టుమచ్చ ఉన్న మంచిది. మితముగా మాట్లాడుదురు. విశేషముగా ఎవ్వరితోను జోక్యము పెట్టుకోరు. యితరుల మనస్సును కించపెట్టరు. గంభీరమైన కంఠస్వరము కలిగి ఉందురు. వాక్ శుద్ధి ఉండును. వీరు ఏది మాట్లాడినా అది జరిగి తీరును. సంఘములో గౌరవ ప్రతిష్టలు కలిగి ఉందురు. బీదవారైనప్పటికీ సంఘములో గౌరవ ప్రతిష్టలకు లోటు ఉండదు. అమిత మేధావం తుడగును.

## నాలుక పై భాగమున

### సూ॥ రసనే కీర్త్యర్థ సౌఖ్య మభీష్ట సిద్ధిః

నాలుకపై భాగమున వుట్టుమచ్చ ఉన్న చాలా మంచిది. రాజకీయాలలో ప్రవేశముఉండును. ఉపన్యాసాలు యిచ్చుదురు. సమయ స్ఫూర్తిగా మాట్లాడుదురు. శతృవులు ఉండరు. మాటలచాతుర్యంతో తన పనులను చేయించుకొందురు. ఎంతటి కష్టమైన పని అయినప్పటికి తన తెలివితేటలతో పూర్తిచేసికొనెడి సామర్థ్యము కలవారగుదురు. పసుపురంగుపుట్టుమచ్చ ఉన్న అసమాన విద్యా విశారదుడు , అఖండ శేముషీ వైభవ సంపన్నుడు అగును. సంబంధములేని విషయాలలో కూడా విశేషమైన ప్రజ్ఞ సంపాదించుదురు. మేధా శక్తి ఎక్కువగా ఉండును.

## నాలుక క్రింద భాగమున

నాలుక క్రింద భాగమున పుట్టుమచ్చ ఉన్న మత సంబంధమైన విషయములపైన, దైవ సంబంధములందు గంభీర ఉపన్యాసములు యిచ్చుచుందురు. సంసారమునందు విరక్తి కలిగి ఉందురు. మత

ప్రచారకునిగాదేశాటనముచేయుదురు.ప్రజలయొక్క ఆదరాభిమా నము లుపొందుదురుసంసార సౌఖ్యములను మనశ్శుద్ధిగా విడచిపెట్టి యోగాభ్యాసపరుడై పరమాత్మయందే భక్తి నిలిపి, సన్యసించి మహాయోగి అవును.

నోటియందు కూడా పెద్ద పుట్టుమచ్చ ఉన్న శాస్త్ర విషయము లందు అభిలాష ఉండును. సముద్ర ప్రయాణములు చేయు చుందురు. పెద్దలయందు గౌరవం అభిమానం కలిగి ఉందురు. మాట నేర్పరితనంతో అందరితోనూ మంచిగా మసలుకొందురు. ఇతరులకు ఉపకారం చేయుచుందురు. రాజకీయములో పేరు సంపాదింతురు. కులగౌరవము నిలబెట్టుదురు.

నోరుచిన్నదిగా ఉన్న మంచి ఆలోచనాపరుడు కాని ధైర్యసాహస ములు తక్కువగా ఉండును. నోరు వెడల్పుగాఉ న్న ధైర్యసాహసములు ఎక్కువ. భోజనప్రియుడు, అసత్యవాది అగును.

## మెడ

మెడ మీద పుట్టుమచ్చ ఉన్న కష్టపడి పనిచేయకుండానే సంపాదన కలుగును. వారసత్వమురీత్యా ఆస్థిలభ్యమగును. కోర్టు వ్యవహారముల మూలముగా లాభము ఉండును.మంచివారి జోలికిపోరు. లిటిగేషన్ అనిన యిష్టము. వీరికి జీవితములో దుర్మరణమునకు పాలగు సంఘటన ఒకటి జరుగును. దాని నుండి తప్పించుకొనిన చాలాకాలము జీవింతురు.

వెన్నెముకకు సూటిగా పుట్టుమచ్చ ఉన్న అతడు ఏ పనిచేసినా ఖచ్చితముగా చేయును. విలువైన వస్త్రములు ధరించును. సామానులు అన్ని అందముగా అలంకరించి ఉండునటుల చూచుకొనుచుండును. ఎవరిమెడ మీద పుట్టుమచ్చ ఉండునో వారు శత్రువులచే బలవంతముగా ఆయుధములచే చంప బడుదురు. లేదా బలవంతముగా ఉరితీయబడుదురు. లేదా ఈ పుట్టుమచ్చ మెడ శిరస్సుతో కలియు





భాగమున సంధిలో ఉన్నచో దారుణముగా యితరులచేత హత్యగా వింపబడుదురు.

## కంఠము

కంఠమునకు ఏ వైపు పుట్టుమచ్చ ఉన్నా చాలా మంచిది. లాటరీల వలన ధనము కలసి వచ్చును. సంఘములో పేరు ప్రతిష్టలు సంపా దింతురు. వివాహం వలన ధన లాభము కలుగును. జ్ఞాతుల వలన ద్రవ్యప్రాప్తి, భూగృహ లాభం కలుగును. వీరికి శ్వాస నిర్బంధన ఉండును.

కంఠము మీద పుట్టుమచ్చ ఉండి క్రమేణా వృద్ధిలోనికి వచ్చును. చిన్నతనము ఆనందములో గడుచును. వృద్ధాప్యములో ఆస్తినంతా ఖర్చుచేసి, బీద దశ ఏర్పడును. పుట్టుమచ్చపై వెంట్రుకలు ఉన్న తల్లి దండ్రులు బాగా ధనవంతులై వుందురు. చిన్నతనము నందు సుఖసంతోషములతో కాలము గడిచి, యౌవన దశలో ఆస్తి చేతికి వచ్చి, విలాసముగా జీవింతురు. విచ్చలవిడితనం అలవాటగును. ముసలితనములో ఆస్త అంతా తరగిపోయి బీదదశ ఏర్పడును. తన పిల్లలకు ఏమీ మిగల్చక హీనదశ పొంది ఉందురు. కంఠమునకు యిరువైపుల పుట్టుమచ్చ ఉన్న రోగములచే బాధపడుచుందురు. సుఖసంతోషములు లేక కష్టముల పాలగుదురు.

కుత్తుక మీద పుట్టుమచ్చ ఉన్న చాలా మంచిది. వీరికి సంఘములో పేరు ప్రతిష్టలు ఉండును. అతి ధోరణి ఎక్కువగా ఉండును. చెప్పిన మాటనే మరల చెప్పుదురు. అతిధోరణిగా మాట్లాడినా ఆ మాటలు ఎదుటివారికి బాధ కలిగించవు. సద్గుణసంపత్తి కలిగి అన్ని విధములా అనుకూలవతియైన భార్య తన బంధు వర్గమునకు చెందినదై ఉండును.ఆమె ఆస్తి కూడా తనకు సంక్రమించును.

## కుడిభాగము

ఈ పుట్టుమచ్చ కంఠమునకు కుడిభాగమున ఉన్న లక్షాధికారి అగును.ఈ మచ్చ తేనె రంగు కలిగి ఉన్న తండ్రి సంపాదించిన ఆస్తి ఉండును. సంగీతమునందు అభిలాష ఉండును. కళలయందు ఆసక్తి ఎక్కువగా ఉండుట వలన విశేషముగా ధనము ఖర్చు చేయుదురు. రాజకీయ వ్యవహారములందు పాల్గొని మంచిపేరు సంపాదింతురు.

## ఎడమభాగము

ఈపుట్టుమచ్చగొంతుకకు ఎడమభాగమున ఉన్న సామాన్య తెలివితేటుల కలిగి బంధువులతో సన్నిహితముగా నుందురు. కష్టములు కలిగినపుడు బంధువుల సహాయము లభ్యమగుటవలన జీవితములో కష్టములు అనుభవించుట జరుగదు. వీరు భోజనప్రియులు. ధనము సంపాదించకపోయినా మంచి పేరు ప్రతిష్టలు సంపాదింతురు. కష్టపడి పనిచేయుదురు. కాని కష్టమునకు తగిన సంపాదన ఉండదు. అతినిద్ర, మందకొండితనము, తిండిపోతుదనము ఉండును.

## కంఠమునకు మధ్యగా

కంఠమునకు మధ్యగానల్లని మచ్చ ఉండి దానిపై వెంట్రుకలు లేని యెడల మంచిదికాదు. గంభీరముగా మాట్లాడే గుణముకలవారగుదురు. ఎదుటివారి మనస్సు బాధపడేటట్లుగా మాట్లాడుదురు. ఒకరుచెప్పిన మాట వినరు. తన గొప్పను తానే విమర్శించుచుండును. చెడు స్నేహితులతో స్నేహము చేయుదురు. జ్ఞాపకశక్తి తక్కువ. దబా యించు గుణము కలిగి ఉందురు. వీరి మాటలు ఎదుటివారిని బాధిస్తాయి. అందువలన వీరికి ఎవరూ ఏ సహాయము చేయుటకు ముందుకురారు.





## కంఠమునకు క్రింద

కంఠమునకు క్రింద పుట్టుమచ్చ ఉన్న చిన్నతనములో వివాహము జరుగును. భార్య ఆస్తి కలిసివచ్చును. ఆ ఆస్తివలన తాను వృద్ధిలోనికి వచ్చును. సంఘములో గౌరవ ప్రతిష్ఠలకోసం ప్రాకులాడుతూ ఉండును. ఆ మచ్చ వెంట్రుకలచే దట్టముగా ఉన్న 45 సంవత్సరములు దాటిన తర్వాత ఆస్తి అంతా ఖర్చుచేసి సామాన్య జీవితము గడుపుదురు. గొంతుకమీద ఏ ప్రదేశమునైన నల్లనిమచ్చ ఉన్న ధన విషయమున చికాకులుపడును. ధనమునిల్వ ఉండదు. చెడు ప్రవర్తన కలిగి ఉందురు. ఈ మచ్చ యితర రంగులలో ఉన్న మధ్యమ ఫలితములు కలుగును.

# వక్షస్థలము

వక్షస్థలము మీద పుట్టుమచ్చ ఉన్న సామాన్యముగా ఉండును. ఏ విషయములోనూ లోటు వుండదు. తన పనితానే చేసికొనును. యితర వ్యవహారములందు జోక్యము కలుగ జేసుకోరు. సామాన్యమైన ధనము, కీర్తి ప్రతిష్టలు పొందును. ఆరోగ్యము బాగుండును. భాగ్యశాలి అగును. ఈ మచ్చ ఎరుపురంగు కలిగిన తక్కువ ధనము ఉండును. సేవకావృత్తిచే జీవించుచుందురు. సోమరి, ముక్కోపి అగును. ఈ మచ్చ నలుపురంగు కలిగిన యాచన చేసి పోషించుకొనును. అష్టకష్టములపాలై దరిద్రుడగును. ఈ మచ్చ పై వెంట్రుకలు ఉన్న స్వల్ప ఆయుర్దాయము కలిగి ఉందురు. నీచకులస్త్రీలతో రమించుచుందురు.

## కుడి రొమ్ముమీద

కుడి రొమ్ము మీద పుట్టుమచ్చ ఉన్న ఆకస్మిక ఆపద కలుగును. సుఖముగా సాగుతున్న జీవితం కష్టాలపాలగును. వ్యాపారమునందు అనుకోని సంఘటనలు జరిగి నష్టపోవుట జరుగును. స్త్రీసంతానము

ఎక్కువగా ఉండును. యితరులనుమోసగించును. వీరి విషయములో మధ్య మధ్య ధన విషయంలోనే సమస్యలు ఏర్పడును. మిగతా విషయములందు శుభ ఫలితములు కలుగును.

## ఎడమరొమ్ము మీద

ఎడమ రొమ్ము మీద పుట్టుమచ్చ ఉన్న అహంకారము కలిగి ఉండును. ఈ పుట్టుమచ్చ అంత మంచిదికాదు. కష్టములు కలుగజేయును. అందరూ తనమాట వినాలనే అభిలాష ఉండును. ధన విషయములో నిలువవుండదు. దుబారా ఖర్చులకు వినియోగింతురు. అవసరమునకు డబ్బులేక బాధపడుచుందురు. బంధువర్గములో సఖ్యత అంతగా వుండదు. ఒకరినొకరి ద్వేషించుకొంఁరురు. చిన్న చిన్న విషయములలో పట్టుదలలు ఏర్పడి తగాదాలు ఏర్పడును. స్త్రీల గురించి ధనమును ఎక్కువగా ఖర్చు చేయుదురు. కామపూరితమైన దృష్టితో స్త్రీలతో స్నేహము చేయుదురు. పుత్ర సంతానము ఎక్కువగా ఉండును. చివరి దశలో పుత్రులవలన కష్టముల పాలగుదురు.

## రొమ్మునకు కుడిభాగమున

రొమ్మునకు కుడిభాగమున పుట్టుమచ్చ ఉన్న మంచిది. పేరు ప్రఖ్యాతులు సంపాదింతురు. ఏదో ఒక కళయందు ప్రవేశం ఏర్పడి, రాణింపు క, దానివలన అభివృద్ధిలోనికి వచ్చెదరు. దేశ దేశములందు గౌరవ ప్రః ష్ఠలు విస్తరించివుండును. ధన విషయంలో లోటు ఉండదు. ఎక్కువ సంపాదన కలిగి ఉందురు. యితరులపై జాలి ఎక్కువ. న్యాయం కోసం పోట్లాడుదురు. మూర్ఖపు పట్టుదలలు ఉండవు. తనకన్న అధికులైన అధికారులు, ధనసంపత్తులు, మొదలగువారితో స్నేహ లాభములు ఉండును. వాహనసౌఖ్యములు ఉండును. గొప్పగా జీవించుటకు అలవాటుపడి ఉందురు. సంకుచిత స్వభావము ఉండును. ఎదుటివారికి





ఉపకారముచేయుగుణము కలిగిఉండును.

## రొమ్మునకు ఎడమభాగమున

రొమ్మునకు ఎడమభాగమున పుట్టుమచ్చ ఉన్న మనస్సు స్థిరముగా ఉండదు. ఎదుటివారి గొప్పతనమును గుర్తించక మూర్ఖముగా వ్యవహరింతురు. ప్రతిచిన్న విషయానికి కోపగించుకొని తన హితవు కోరేవారికి యిబ్బంది కలిగించుచుందురు. ఏ పనియందు నిలకడ ఉండదు. అబద్దాలు బాగా ఆడుదురు. మోసగించి బ్రతుకుట అలవాటు పడుదురు. ఏ ఊరునందు స్థిరమైన జీవితము గడపలేక చంచలమనస్సు కలిగి ఉందురు.

## రొమ్మునకు మధ్య భాగమున

రొమ్మునకు మధ్యభాగమున పుట్టుమచ్చ ఉండి ఆ మచ్చపై వెంట్రుకలు ఉన్నచో మధ్యమ ఆయుర్ధాయము కలుగును. కావలసినంత డబ్బుచేతిలో ఉండును. ఉత్తమ స్త్రీలవైపు కన్నెత్తి చూడరు. తనకన్న తక్కువ రకమైన స్త్రీలతో సంబంధము పెట్టుకొనుచుందురు.

ఈ పుట్టుమచ్చమీద వెంట్రుకలు లేనిచో ధనవిషయములో లోటు ఎప్పుడూ వుండును. దరిద్రముతో బాధపడుచుందురు. స్థిరత్వములేక ఒక ఊరు నుండియింకొక ఊరుకు తిరుగు చుందురు. యాచనము వలన జీవనము చేయుచుందురు.

ఎరుపురంగు గల పుట్టుమచ్చ ఉన్నరాణింపులేని సేవికా వృత్తి వలన జీవితము గడుపుదురు. కష్టమునకు తగిన ప్రతిఫలము ఉండదు. తిండిబోతుతనం,అతినిద్ర, మందకొండితనము, ఎప్పుడు చిరుబురులాడు స్వభావం ఉండును.

## రొమ్మునకు కొంచెం పై భాగమున

రొమ్మునకు కొంచెం పై భాగమున పుట్టుమచ్చ ఉన్న ధన సంపాదన

విషయములో తెలివితేటలు కలిగిఉందురు. వాహనయోగం, దేశవ్యాప్తంగా పేరుప్రతిష్టలు కలిగి ఉందురు. ప్రతి విషయములను అతి మెలకువతో పరిశీలించుచుందురు. పెద్దలయందు వినయ విధేయతలు కలిగి ఉందురు. ఆత్మవిశ్వాసం ఎక్కువ. మొండి ధైర్యం, చొరవసాహసం ఉండును.

## రొమ్మునకు ఎడమభాగానకొంచెం పైన

రొమ్మునకు ఎడమభాగాన కొంచెంపైన పుట్టుమచ్చఉన్న ఏ పనితలపెట్టినా జయము కలుగుతుంది. పరస్త్రీ వ్యామోహము ఎక్కువ. జీవితము లో చాలా కష్టములు కలుగును. కాని అవి లెక్కలోనికి రావు. భార్యతోకన్న పరస్త్రీలతో ఎక్కువ ఆనందమున పొందుదురు.

## కుడిభాగమున ప్రక్క ఎముకలయందు

రొమ్మునకు కుడిభాగాన ప్రక్క ఎముకల మీద పుట్టుమచ్చ ఉన్న అంత మంచిదికాదు. వీరు మంచిపనులు, ఘనకార్యములు చేయు టకు ప్రయత్నించుదురు. కాని తెలివితేటలు, సమయస్ఫూర్తి తక్కువగా ఉండును. మందకొండితనము, పిరికితనము ఉండును.

## ఎడమభాగమున ప్రక్క ఎముకలమీద

రొమ్మునకు ఎడమభాగమున ప్రక్క ఎముక మీద పుట్టుమచ్చ ఉన్న అంతమంచిదికాదు. ఎల్లప్పుడు ఏదో రకమైన యిబ్బందులు పడుచుందురు. అనుకోనికష్టములు ఎదురుకొందురు. సుఖ సంతోషాలు అంతగా ఉండవు. మధ్య రకముగా జీవనము సాగించును.

ప్రక్కఎముకలమీద పుట్టుమచ్చదుఃఖమునకు కలుగ జేయును. ఎర్రనిపుట్టుమచ్చ నడిరొమ్మున ఉన్నచో నిర్దయు డగును. కోపం ఎక్కువగా నుండును.

## భుజమునుండి కటివరకు గల ప్రదేశమున

భుజమునుండి కటి వరకుగల ప్రదేశమున పుట్టుమచ్చ ఉన్న ఎంత





ధనము సంపాదించినా నిలువ ఉండదు. పిత్రార్జితము బాగా ఉండును. దుబారా ఖర్చులు అధికముగాచేసి యిబ్బందులకు గురి అగుదురు. ఎలాగ వచ్చిన సొమ్ము అలాగే పోవును. సుఖాలు కన్నా కష్టాలు ఎక్కువగా ఉండును. ఈ పుట్టుమచ్చలు కుడి ఎడమలలో ఏ ప్రక్కనున్న యివే ఫలితములు కలుగును.

పుట్టుమచ్చ పెద్దదైనచో ఆమచ్చ సూచించు ఫలితములు మంచిదైనను, చెడ్డదైనను చాలా ఎక్కువగా ఉండును. పుట్టుమచ్చ చిన్నదైనా దాని ఫలితము చాలా తక్కువగా నుండును.

పుట్టుమచ్చగుండ్రముగా ఉన్న మంచిది. పొడవుగా ఉన్న సామాన్య మైన అదృష్టవంతుడగును. పుట్టుమచ్చ కోణములు కలిగి ఉన్న సుఖ దుఃఖములు సమానముగా ఉండును.

పుట్టుమచ్చలమీద వెంట్రుకలు చాలా ఎక్కువగా ఉన్న ఆ వ్యక్తి దుఃఖ సముద్రమున యీదులాడుచూ చుండును. అట్టి వెంట్రుకలు పొడవు గా ఉండి పలుచగా ఉన్నచో ఆవ్యక్తి అన్ని విధములా అదృష్ట వంతుడగును.

# కడుపు

కడుపుమీద పుట్టుమచ్చ ఉన్న సామాన్యంగా తిండిపోతు తనాన్ని సూచించును. ఈమచ్చ ఎరుపు, ఆకుపచ్చ, పసుపు రంగులలో ఏ రంగైనా మంచి వ్యాపారము చేయగలుగుదురు. ధనికులతో స్నేహము, ధనవంతుడగుటకు అవకాశము కలుగుచుండును. రత్న పరీక్షయందు నిపుణత్వము కలిగి ఉందురు.

## పొత్తికడుపుమీద

పొత్తి కడుపుమీద పుట్టుమచ్చ ఉన్న అంత మంచిదికాదు. అజీర్తి రోగం ఉండును. జీర్ణశక్తి తక్కువగా ఉండును. ఎప్పుడూ ఏదో ఒక

రోగముతో బాధపడుచుందురు. ఒక్కొక్కప్పుడు అపాయకరమైన వ్యాధులుకూడా కలుగును.

## కుడిభాగమున

కడుపుకుడిభాగమున పుట్టుమచ్చ ఉన్న యితర దురలవాట్లు ఉండవు.వ్యవసాయము ముఖ్య జీవనముగా జీవింతురు.సర్వసుఖముల అనుభవింతురు. ఈ మచ్చ కుడిభాగమున ఉన్న తీరని వ్యాధి వచ్చును. అసూయ కలిగి ఉందురు.దురాశతో వ్యవహరింతురు. శుభ్రతలేని వస్తువులు ధరింతురు. జీవితములో సర్వసుఖాలు అనుభవింతురు.

## ఎడమభాగమున

కడుపుకు ఎడమభాగమున నల్లమచ్చ ఉన్న మోసముతో కూడిన పనులతోధనార్జన చేయుదురు. భోజన ప్రియులు, దురాశ ఎక్కువ తనను నమ్మినవారిని మోసం చేయుటలో వెనుకంజ వేయరు. మొత్తం మీద ధనసంపాదన బాగా ఉండును.

## కడుపుదిగువ

కడుపుకు దిగువభాగమున పుట్టుమచ్చ ఉన్న ఎల్లప్పుడు ఏదో రకమైన దీర్ఘవ్యాధితో బాధపడుచుందురు. ఆ కారణము వలన ఎల్లప్పుడు బలహీనముగా ఉందురు.

## మధ్య భాగమున

కడుపుకు మధ్యభాగమున పుట్టుమచ్చ ఉన్న వీరికి సమానమైన ఆదాయం ఉంటుంది. చెడుపనులు చేయరు. వ్యవసాయమే ముఖ్య జీవనోపాధిగా ఉండును.

# బొడ్డు

## బొడ్డుపైన





బొడ్డుపైన నల్లపుట్టుమచ్చ ఉన్న శరీర ఆరోగ్య విషయంలో శ్రద్ధతక్కువగా ఉండును. శుభ్రత ఉండదు. మాసిన బట్టలు వేసుకొందురు. యితరుల సంపాదనపై అసూయ కలుగును వాటిమూలముగా తాను సంపాదించలేకపోతూ ఉంటారు. తిండియందు ఆసక్తి తక్కువ. ఈ పుట్టుమచ్చ పెద్దగా ఉన్నచో ఎల్లప్పుడూరోగములతో బాధపడుచుందురు.

బొడ్డమీద పుట్టుమచ్చ ఉన్నచో గొప్ప కీర్తిని సంపాదింతురు. పెద్దలయందు వినయవిధేయతలు కలిగి ఉందురు. భోజన ప్రియులు వ్యవసాయమునందు ఆసక్తి ఉండును.

ఈ పుట్టుమచ్చ నలుపురంగు కాక ఆకుపచ్చ, ఎరుపు, తేనె రంగులలో ఉన్న వ్యవసాయం వలన ధనార్జన చేయును. పెద్దలయందు వినవిధేయతలు కలిగి ఉందురు. న్యాయాన్యా యవిచక్షణ లేక మెలుగుచుందురు. డబ్బుకు యిబ్బంది ఉండదు.

## బొడ్డునకు క్రింద భాగమున

బొడ్డునకు క్రింద భాగమున పుట్టుమచ్చ ఉన్న పరస్త్రీలయందు ఆసక్తి ఎక్కువగా ఉండును. ధనార్జన ఉండును. దొంగలవలన ధనమును కోల్పోయి, ఒక్కసారిగా బీదవాడగును. అబద్ధాలు ఆడుచూ, ఒకచోట నిలకడగా ఉండక తనయొక్క నడవడిక బాగా ఉండక పోవుటవలన పలుచోట్లకు తిరిగే అవకాశము కలుగును.

శరీరం మీద పుట్టుమచ్చల రంగు చాలా చిక్కగా ఉన్న ఆ రంగు సూచించు ఫలితము మంచిదైనను, చెడ్డదైనను విశేష ఫలితము కలుగును

పుట్టుమచ్చ రంగుపాలిపోయి ఉన్నచో అది సూచించు ఫలితములు మంచివైనను, చెడ్డవైనను చాలా తక్కువ ఫలితము ఉండును.

పుట్టుమచ్చల రంగునుబట్టి, వాటి ఆకార పరిణామము లనుబట్టి ఫలితములు నిర్ణయించుకొనవలెను.

# చంకలు

## కుడిచంక

కుడిచంకలో పుట్టుమచ్చ ఉన్న సామాన్యమైన ధన సంపాదన కలిగి ఉందురు. తాను ఘనంగా బ్రతకాలనే ఆశతో శక్తికి మించిన ప్రవర్తనల వలన విపరీతమైన యిబ్బందు లకుగురి అగుదురు. భుక్తికి లోటురాదు. తాను ధనవంతుడు కాలేదనే ఆలోచనతో విచారించుదురు.

## ఎడమచంక

ఎడమచంకలో పుట్టుమచ్చ ఉన్న స్త్రీ సాంగత్యముపై కోరిక ఉండును. పరస్త్రీవాంఛతో తనకు లభించిన వారితో తృప్తి పడక నిరాశతో వుందురు. వీరు తమ జీవితమునందు ఏమీ సాధించలేదన్న విచారముతో మరణింతురు. అకాలమృత్యువుకు గురి అగుదురు.

# భుజములు

భుజముల మీద పుట్టుమచ్చ ఉన్న మనస్సు నిశ్చలముగా ఉండదు. ఏదో ఒక కష్టముతో బాధలు పడుచుందురు.

## కుడిభుజము

కుడిభుజముపై పుట్టుమచ్చ ఉన్న ధైర్య సాహసములు ఎక్కువగా ఉండును. ఏదైనా పని అనుకొనినచో అది నెరవేరనిదే నిద్రపోరు. వివేకం, విజ్ఞానం, సూక్ష్మబుద్ధి ఉం డును.ఎవరిమీదనైనా పగబట్టిన కక్షతీరేవరకు నిద్రపోరు. పట్టుదల ఎక్కువగా ఉండును.

## ఎడమభుజము

ఎడమభుజముపై పుట్టుమచ్చ ఉన్న అన్న వస్త్రాదులకు లోటు వుండదు. కాని కొన్ని విషయములలో మూర్ఖత్వముతో వ్యవహరింతురు. పంతం వస్తే ఎంతకైనను తెగించును. ఎవరితో పడితే వారితో





తగవులాటలు తెచ్చు కొందురు. గోటితో పోయేదానికి గొడ్డలి ఉపయోగించ వలసిన స్థితి వచ్చేలా చేయుచుందురు.

# చేతులు

## కుడిచెయ్యి

కుడిచేతిమీద పుట్టుమచ్చ ఉన్న ధనార్జన బాగుండును. ఏదైనా పని తలపెట్టినచో అది అయ్యేవరకు నిద్రపోరు. శరీర ఆరోగ్యము బాగుండును. న్యాయన్యాయ విచక్షణచేయుదురు. ప్రతి విషయములోను ధైర్యముతోను, చొరవతోను ప్రవర్తించి తనపని చేసి కొందురు. మంచి ఆలోచనాశక్తి ఉండును. మహాజ్ఞాని, బలవంతుడు అగుదురు.

## ఎడమచెయ్యి

ఎడమచేతిమీద పుట్టుమచ్చ ఉన్న సామాన్య జీవితము గడుపుదురు. తలచిన కార్యము నెరవేరేవరకు ఏదో రకమైన తంటాలు పడుదురు. ధన సంపాదన ప్రయత్నము లో కొన్ని మాత్రమే ఫలించును మనస్సు స్థిరముగా ఉండును. శత్రువులను వశపరచుకొందురు.

## మోచెయ్యి

మోచేతికి సమీపమున పుట్టుమచ్చ ఉన్న కష్టముల పాలగుదురు. చపలచిత్తులు, అనగా స్థిరముగా మనస్సు ఉండదు. ప్రారంభములో కష్టములు కలిగినా చివరకు ఫలితములు కలుగును. ఏ పనియందు స్థిరత్వము ఉండదు. ఒకపని చేయాలని అనుకొని వేరొకపని చేయుదురు. బంధుమిత్రులు ఎక్కువగా ఉన్నప్పటికి వీరియొక్క నడవడిక వలన దూరముగా నుందురు. వీరికి జీవితములో విశ్రాంతి తక్కువ. సుఖ సౌఖ్యములు సామాన్యము.

## మోచేతిమీద

మోచేతి మీద పుట్టుమచ్చ ఉన్న చాలా మంచిది. ఏ పని మొదలుపెట్టినా వెంటనే అగును. యితరులకు సహాయము చేయు స్వభావము కలిగి ఉందురు. ఐశ్వర్యమువలన కలుగు ఆనందములను, భోగభాగ్యములను అనుభవింతురు. ఏదో ఒక కళయందు ప్రజ్ఞ కలిగి దాని వలన ధనమును సంపాదించుదురు. పర స్త్రీలను పొందుటకు అభిలాషపడుచుందురు.

## మణికట్టు

మణికట్టు కుడిభాగమునగాని, ఎడమభాగమున పుట్టుమచ్చ ఉన్న చిన్నతనము నందు కడుబీద స్థితిలో నుందురు. చాలా కష్టములు, చిక్కులు పడుదురు. నడి వయస్సులో ధనార్జన చేయుదురు. చిన్నతనములో ఎన్ని కష్టములు అనుభవించారో అన్ని సుఖములు పెద్దయ్యాక అనుభవింతురు.

కుడిమోచేతి మణికట్టుమీద పుట్టుమచ్చ ఉన్న కవిత్వము, చిత్రలేఖనములలో ప్రవేశముండును. ఆ విద్యలయందు ప్రావీణ్యము పొంది సర్టిఫికెట్లు పొందుదురు. దైవభక్తి భూతదయ ఉండును. జాలికల హృదయము ఉండును. జీవితములో కష్టము లు అనుభవించక సుఖప్రదముగా సాగును. ఎడమ మోచేతి మణికట్టుమీద పుట్టుమచ్చ ఉన్న వ్యవసాయరీత్యా లాభముండును. పరస్త్రీలయందు ఆసక్తి కలిగి ఉందురు.

మణికట్టునుండి వ్రేళ్ళ నుండి చివరకుగల ముంజేతి యందు ఎచ్చట పుట్టుమచ్చ ఉన్న చాలా మంచిది. వ్యవసాయ సంబంధ మైన పనుల వలన ధన సంపాదన కలుగును. స్థలములు, భూములు కొందురు. మరల వాటిని అమ్మినపుడు మంచిధర వచ్చి లాభముండును. పరస్త్రీలయందు కోరిక బాగా ఉండును. స్పెక్యులేషన్ బాగా అనుకూలించును. సంసారసౌఖ్యం బాగుగా ఉండును. బంధువుల యందు మంచి నడవడి కలవాడని పేరు ఉండును. చిన్నతనమునందు యౌవనము నందు సామాన్యముగా ఉండి ముసలితనములో సుఖపడుదురు.

## అరచెయ్యి





అరచేతి ముందు ఆకుపచ్చ, ఎరుపు,తేనెరంగులలో పుట్టుమచ్చ ఉన్న చాలామంచిది. ధనము, కీర్తిని సంపాదించు అవకాశములు కలుగును. గౌరవప్రతిష్ఠలు, పలుకుబడికిలోటు ఉండదు. అనేక శుభఫలితములు కలుగును. ఈ మచ్చ నల్లగా ఉన్న అంత మంచి ఫలిత ములు ఉండవు.

అరచేతిలో పుట్టుమచ్చ ఉన్న గణితశాస్త్రము, కవిత్వము, చిత్రలేఖనము వీటిలోఒకదానిపై ఎక్కువ ఆసక్తి కలిగి ఉందురు. న్యాయన్యాయ విచక్షణ చేసి న్యాయమార్గము ను అనుసరింతురు.

## కుడిఅరచేయి బొటనవ్రేలు క్రింద

కుడి అరచేయి బొటన వ్రేలు క్రింద పుట్టుమచ్చ ఉన్న ధన విషయములో ఏ విధమైన లోటు ఉండదు. ఆర్థికలోపం లేనప్పటికీ ధనవంతుడు క్రిందరాడు. మనిషియందు ఖచ్చితము, కపటము ఉండదు. స్వతంత్ర ఆలోచనలు తక్కువ. ఒకరి యొక్క చెప్పు చేతలలో ఉండి జీవించుట జరుగును. తాత, తండ్రులు సంపాదించిన ఆస్తి చేతికి వచ్చినా అది నిలవ ఉండదు. తను పనిచేసే సంస్థయందు యజమాని యెడల విశ్వాసము కలవాడుగా ఉండును. యితరులకు ఉపకారముచేయు గుణము ఉండును. యితరుల అధికారమునకు వశుడై ఉండును.

## కుడి అరచెయ్యి చిటికెన వ్రేలు క్రింద

కుడి అరచెయ్యి చిటికెన వ్రేలు క్రింద పుట్టుమచ్చ ఉన్న ధన సంపాదన విషయం లో మంచి నేర్పరితనము కలిగి ఉందురు. లౌకిక వ్యవహార జ్ఞానం ఉండును. సమయస్ఫూర్తి, విచక్షణ కలిగిఎటువంటి చిక్కు సమస్య అయినా సరే సులభముగా పరిష్కారము చేయుదురు. దైవభక్తి కలిగి ఉందురు. అనుకూలవతి అయిన భార్య లభించును. సంతానము ఎక్కువగా ఉండును. మంచి వారిని ఆదరించుటలో ముందుందురు. ఆయుర్దాయము ఎక్కువ. తలచినకార్యము వెంటనే నెరవేరును. ధనం సంపా దించి స్థిరాస్థిని సంపాదింతురు.

## కుడి అరచేయి చూపుడు వ్రేలు క్రింద

కుడి అరచేతి చూపుడు వ్రేలు క్రింద పుట్టుమచ్చ ఉన్న ధనము బాగా సంపాదించురు. సంసారసౌఖ్యము పై కొంచెం విరక్తి కలిగి ఉందురు. ఒంటరిగా జీవించుటకు యిష్టపడుదురు. ప్రభుత్వఉద్యోగము నందు మంచి ఉన్నత దశకు వచ్చి గౌరవాధికారములను పొందుదురు. క్రింద ఉద్యోగులు తమ మాట వినేలా ప్రవర్తించు దురు. వ్యవహారజ్ఞానిగా పేరు సంపాదించుదురు. మాటలతోనే ధనార్జన చేయుదురు. మనస్సులో కపటము ఉన్నా పైకి ఎంతో ప్రేమ కలవానిగా నుందురు.

## మధ్య వ్రేలుక్రింద

కుడిచేయి అరచేతి మధ్యవ్రేలు క్రింద పుట్టు మచ్చ ఉన్న అంత మంచిదికాదు. బాగా విపరీతంగా ధనమును ఖర్చుపెట్టుదురు. మంచిమార్గమును అనుసరించక తల్లి తండ్రులు సంపాదించిన యిచ్చిన ఆస్తిని జల్సాగా విలాసము లకు ఖర్చు చేయుదురు. జీవితములో న్యాయమునకు చోటు లేదన్న గట్టినమ్మకంతో చెడుపనులు ఎక్కువగా చేయుదురు. తల్లిదండ్రులు సంపాదించిన ఆస్తి వీరికి సంక్రమించదు. భార్యా భర్తల మధ్య అన్యోన్యము ఉండదు. ఒకరిమాటయందు మరొకరికి యిష్టములేక మనస్పర్థలు కలుగుచుండును. పరస్త్రీ వ్యామోహము ఎక్కువగా నుండును. కనిపించిన అమ్మాయల్లా కావాలనే కోరిక ఉండును. ఈ వ్యామోహము వలన ధనము విపరీతముగా ఖర్చు చేయుదురు. బంధువర్గమువారియొక్క ఆదరాభి మానములను కోల్పోవుదురు. వారికి కంటకప్రాయ ముగా మెలుగుచుందురు. జీవితంలో సాధించేది తక్కువ, పోగొట్టుకొనేది ఎక్కువగా ఉండును. వీరు చేసే పనులన్నీ తప్పుడు పనులు అవడం వలన యితరులు వీరిని తిట్టు చుందురు. కావున వారు వీరికి విరోధులుగా నుందురు.

## మండమీద

చేతి మండమీద పుట్టుమచ్చ ఉన్న మంచి ఆరోగ్యవంతుడై ఉండును





ధన విషయంలో ఏ విధమైన లోటుపాట్లు ఉండవు. కుటుంబ సంతానాభివృద్ధి ఎక్కువ. వంశాభివృద్ధి కలవారగుదురు. మునిమనవలు పుట్టువరకూ జీవింతురు. తాను సుఖపడుతూ తన బంధువర్గములోని వారిని సుఖపెడుదురు. వారిని వృద్ధిలోనికి తెచ్చుటకు ఎక్కువగా కృషి చేయుదురు.

## ఉంగరపు వ్రేలుక్రింద

కుడి అరచేతి ఉంగరపు వ్రేలు క్రింద పుట్టుమచ్చ ఉన్న ఆశ ఎక్కువగా ఉండును. సామాన్యమైన ధన సంపాదన కలిగి ఉందురు. ఎన్నో పనులు చేయాలని కోరిక ఉండును,కాని ఆపని పూర్తి అగుట జరుగదు. మనస్సు స్థిమితము గా ఉండుట తక్కువ. ఒక పనిమొదలుపెట్టి ఆపని ఆపి వేరొక పని చేయుదురు. తరచు కష్టాలు సంభవించును. కొందరు వాటిని ఎదుర్కొని బయటపడతారు. వచ్చినకష్టాలు ఒక పట్టున వదలవు. జలగలాగ పట్టుకొని పీడించును. అన్నవస్త్రములకు లోటు లేనివారై ఉందురు. మనశ్శాంతి లేనివాడగును.

## అరచేతిలో ఎడమభాగమున

కుడి అరచేతిలో ఎడమవైపు క్రింద భాగమున పుట్టుమచ్చ ఉన్న ఆకస్మిక ధనలాభము కలుగును. లాటరీలవలనగాని, గుర్రపుపందెములవలనగాని అలాంటిది సంభవించును. వీరికి మొదట అంతగా ధనము ఉండదు. క్రమేణా ధన సంపాదన కలుగును. ఆకస్మాత్తుగా ధనము వచ్చి పడును. జీవితం మధ్యలో ఎప్పుడో ఒకప్పుడు ధనవంతుడగును.

## కుడి మణికట్టుపైన

కుడి అరచేయి మణికట్టు మీద పుట్టమచ్చ ఉన్న తల్లిదండ్రు లయందు భక్తి విశ్వాసములు కలిగి ఉందురు. వీరికి దురాలో చన, నెమ్మదితనం ఉండును. మంచితనముతో ప్రవర్తించి పేరు ప్రతిష్ఠలు

సంపాదింతురు. బంధువర్గమువారితో సఖ్యతగా ఉండి వారి వలన ఉపకారములు పొందుదురు. సామాన్యమైన సంపాదన కలిగి ఉండును.

మణికట్టు అడుగుభాగమున పుట్టుమచ్చ ఉన్న డబ్బును మంచినీళ్ల ప్రాయముగాఖర్చుచేయుదురు. ఎవరినీ లెక్కచేయరు. ధనసంపాదన లేకపోయినా పిత్రార్జి తమంతయూ మంచి నీళ్లవలె ఖర్చు చేయుదురు. ఒకచోటస్థిరముగా ఉండరు. దేశ సంచారముచేయుదురు. సంసారతాపత్రయము ఉండదు. ఒంటరిగా జీవించుటనే కోరు చుండురు, దేశదిమ్మరి అగును ఎడమ అరచేతిలో పుట్టుమచ్చలు ఉన్నప్పటికీ అంతగా ప్రాధాన్యత ఉండదు. పెద్దగా ఫలితములు ఉండవు.

## వ్రేళ్ళు

వ్రేళ్లకు మరియొకపేరు అంగుళులు అందురు. వీటి మీద పుట్టుమచ్చలకు వేరు వేరు ఫలితములు కలవని శాస్త్రకారులు చెప్పియున్నారు. సాధారణంగా వ్రేళ్లమీద పుట్టుమచ్చ ఉన్న అంత మంచిదికాదు. కుడి చేతివ్రేళ్లకే ప్రాముఖ్యత కలదు.

## బొటనవ్రేలు

కుడిచేతి బొటన వ్రేలు మీద ఎక్కడ పుట్టు మచ్చ ఉన్న ఆత్మ విశ్వాసము ఎక్కువగా ఉండును. ఆ వ్యక్తిలో బల్లగుద్ది మాట్లాడగల శక్తి సామర్థ్యములు ఉండును. తాను నమ్మిన దాని కోసం ప్రాణాలు అర్పించయినా సరే పోట్లాడగల మనిషి. తర్కవితర్కములు చేయుట యందు నేర్పరితనము ఉండును. పాయింటులేని విషయము నయినా సరే పాయింటు లాగి అవతలివారిని ఓడింతురు. మాటవిలువ, తీవి ఉండును. ప్రయివేటు సంస్థలోగాని, గవర్నమెంటు సంస్థలోగాని ఉద్యోగము చేయుదురు. లాయర్లు, మెజిస్ట్రేట్లు మొదలయిన పదవులను చేపట్టుదురు. ఈరెండులేనివాడయిన తర్కవాదంలో గట్టివాడై ఉండును. వీరు ఏ





ఉద్యోగములో ఉన్ననూ ఒక విధమైన అధికార గౌరవములు పొందుదురు. ధన సంపాదన ఉండును.

## చూపుడువ్రేలు

కుడిచేతి చూపుడువేలు క్రింద పుట్టుమచ్చ ఉన్న మంచిదికాదు. తరచుగా తగాదాలు పడి కోర్టుకు వెళ్ళుచుండుట జరుగును. ఇతరుల తారతమ్యం లేకుండా దూషించుచుందురు. దొంగతనము నందు అనుభవము కలవాడై ఏదో ఒక నేరము చేయుచు జైలుశిక్ష అనుభవించు చుందురు. అప్పుడప్పుడు కఠినశిక్షలు కూడా పడును. అబద్ధము లాడుటలో వెనుదీయరు. యితరులను లెక్కచేయని మనస్తత్వము కలవార గుటవలన శత్రువులు ఎక్కువగా ఉండును. చదవు సంధ్యలు తక్కువగా ఉన్న సంస్కారం కావాలని కోరుతుంటారు. ఎదుటివారిని దూషించుట అలవాటు. తనకుతాను మంచి వాడని గొప్పలు చెప్పుటలో నేర్పరి. వీరిని ప్రేమించే వ్యక్తులు ఎక్కువగా ఉండరు. వీరిని చూడగానే ఒక విధమైన అనహ్యాభావం ఏర్పడును. రాజకీయవ్యవహారమూలముగా తరచుగా కోర్టులకు వెళ్ళిశిక్షలు అనుభవించుచుందురు.

## మధ్యవ్రేలు

మధ్యవ్రేలు మీద పుటుమచ్చ ఉన్న యితరులను లెక్కచేసే మనస్తత్వం తక్కువగా ఉండును. చెడుసహవాసము లు ఎక్కువ. మత్తుపదార్థాలపై కోరిక ఎక్కువ. చెడువనులు చేయునవుడు యితరులు ఏమనుకుంటారో అనే సంకోచం లేకుండా వ్యవహరిస్తారు. సిగ్గువిడచి ప్రవర్తిస్తారు. పరస్త్రీలయందు కోరిక ఎక్కువగా ఉండును. వీరికి చెడు అలవాట్లు ఉన్నప్పటికీ గౌరవ మర్యాదలు కలిగి ఉందురు.

## ఉంగరపు వ్రేలు

ఉంగరపు వ్రేలు మీద పుట్టుమచ్చ ఉన్న చాలా మంచిది. ధన సంపాదన బాగా ఉండును. దైవభక్తి ఉండును. దైవకార్యములు, పూజలు, పునస్కారాలు మీద నమ్మకము ఎక్కువగా ఉండును. న్యాయన్యాయ విచక్షణ చేసి, ధర్మ మార్గములో నడుచుదురు. బుద్ధిశాలి, గడుసరి తనము కలిగి ఉందురు. ప్రతి విషయమును ఆలోచించి తొందరపాటు లేకుండా ఆ కార్యమును ఆచరణలో పెట్టుచుందురు. తనకు ఉన్నదానిలో యితరులకు సహాయము చేయుదురు.యితరుల కష్టమును చూసి సహించలేరు. బంగారపు ఆభరణములయందు కోరిక ఎక్కువ. తీర్థ యాత్రలు చేయుదురు. విలువైన వస్తు, వస్త్రములు ధరించు టయందు కోరిక ఎక్కువ. భూతదయ, శాంతస్వ భావము,సదాచారము తెలియజేయును.

## చిటికెన వ్రేలు

కుడిచేతి చిటికెన వ్రేలు మీద పుట్టుమచ్చ ఉన్న అదృష్టవంతులు, ధనమును సంపాదించుటలో మంచినేర్పరితనము కలిగి ఉందురు. పరస్త్రీ వాంఛ ఎక్కువగా ఉండును. అమితముగా స్త్రీ సంభోగము చేయు దురు. ఎల్లప్పుడు పరిశుభ్రముగా ఉందురు. విలువైన వస్త్రములు ధరించుదురు.

శిరోరేఖ మీదపుట్టుమచ్చ ఉన్న అనేక విధములైన కష్టములు అనుభవింతురు. జీవితముపై విరక్తి ఏర్పడును.ఒక్కొక్కప్పుడు పిచ్చికూడా పట్టును. ఈ మచ్చ ఆకుపచ్చ,ఎరుపు, తెనే రంగులలో ఉన్న మంచి తెలివి తేటలు కలిగి ఏపనినైనా సరే సునాయాసంగా చేయుదురు. మంచి పేరు ప్రఖ్యాతులు సంపాదింతురు.

శిరోరేఖ మీద ఎరుపు, ఆకుపచ్చ,తేనెరంగులలో పుట్టుమచ్చ ఉన్న గొప్పదశగలజాతకుడగును. కష్టపడి పేరు ప్రఖ్యాతులు సంపాదింతురు.





అతి తక్కువ కాలములో విశేషమైన ధనం, కీర్తి సంపాదింతురు. వాహన యోగం ఉండును. నల్లనిమచ్చ ఉన్న కష్టములు, చిక్కులు కలుగును.

హృదయరేఖమీద నల్లమచ్చ ఉన్న స్త్రీ మూలకముగా విరోధములు వచ్చును. భార్యాభర్తలకు అన్యోన్యత లేకపోవుట లేదా భార్యా ఆకస్మిక మరణము పొందుట జరుగును.

హృదయరేఖ మీద ఎరుపు, ఆకుపచ్చ, తేనెరంగులలో పుట్టుమచ్చ ఉన్న అందమైన భార్య ఉండి ఆమె వలన సంపదలు కలుగును. చక్కటి పరస్త్రీ సాంగత్యం లభించును. పరస్త్రీల వలన ధనలాభము కలుగును.

రవిరేఖ మీద నల్లని పుట్టుమచ్చ ఉన్న విద్యాభంగము, అపకీర్తి, నలుగురిచే తూలనాడబడుట, కోర్టు శిక్షలు మొదలైన ఫలితములు కలుగును. రాజకీయ వ్యవహార చిక్కులు, కీర్తి ప్రతిష్టలు సంపాదిచును. నాయకత్వం వహింతురు.డిగ్రీపొందే విద్యవచ్చును. ఉన్నతమైన ఆదర్శ ములు కలిగిఉందురు. అచిరకాలములోనే విశేషముగా ధనం సంపాదించును.

శుక్రస్థానముపై పుట్టుమచ్చ ఉన్న సంసారసౌఖ్యము తక్కువ. స్త్రీల వలన సుఖము ఉండదు. స్త్రీలతో తరచుగా విరోధములు ఏర్పడుచుండును. భార్య వీరిని వదిలివేయుట లేదా భార్యను వీరు వదిలిపెట్టుట జరుగును. యింకా సుఖసంబంధమైన వ్యాధులు వచ్చును.

అదృష్టరేఖమీద ఎరుపు, తేనె, ఆకుపచ్చ రంగు గల మచ్చ ఉన్న విశేషమైన ధన సంపాదన కలుగును. తక్కువకాలములో ఎక్కువ సంపా దించుదురు. స్వశక్తి వలన పైకి వచ్చును.

ఈ మచ్చ నల్లగా ఉన్న తల్లితండ్రులు సంపాదించిన ఆస్తి అంతయూ పాడుచేసి చివరకు చేతిలో చిల్లిగవ్వ కూడా లేక బాధపడుదురు. ఋణబాధలు ఎక్కువగాఉండును. చంద్రస్థానము మీద నల్లని పుట్టుమచ్చ ఉన్న నీటిగండము ఉండును. వీరు సముద్రప్రయాణములు

చేయకూడదు. యింకా కాలవలో ఈత ఈదునపుడు జాగ్రత్తగా ఉండవలెను.

బుధస్థానము మీద నల్లని పుట్టుమచ్చ ఉన్న వ్యాపార రీత్యాధననష్టము ఉండును. యింకా జాయింటుదార్ల వలన మోసము కలుగును. ధన విషయములో నమ్మినవారి వలన మోసములు, దగాలు పొందుచుండును.

శనిస్థానము మీద నల్లని పుట్టుమచ్చ ఉన్న ఏ వృత్తియందు స్థిరత్వము ఉండదు. అనేక వృత్తులలో మార్పులు కలుగును. స్థిరత్వము ఉండదు.

గురు స్థానము మీద నల్లని పుట్టుమచ్చ ఉన్న చేయు కృషియందు సంగము కలుగును. అభివృద్ధికి ఆటంకము ఏర్పడును.

మొదటికుజస్థానమందు పుట్టుమచ్చ ఉన్న శత్రువుల వలన చిక్కులు కలుగును. దెబ్బలాటలలో గాయములు తగిలి, గుర్తులుఏర్పడును. ఈ స్థానము ఎత్తుగా ఉన్న పెద్ద దెబ్బలు వాహన ప్రమాదములు కలుగును.

శుక్రస్థానముమీదపుట్టుమచ్చ ఉన్న సుఖసంబంధమైన వ్యాధులచే పీడింపబడుదురు.

# గోళ్ళు

గోళ్ళ మీద అర్ధచంద్రాకారములో తెల్లనిమచ్చలు అప్పుడప్పుడు బయలుదేరుచుండును. ఈ మచ్చలు తాత్కాలికముగా ఫలితములు యిచ్చుచుండును. వీటి ఫలితములు ఒకసంవత్సర కాలముగానే కనిపించుచుండును. ఈమచ్చలు మానవుల యొక్క సుఖ దుఃఖము లను తెలుపును.

## బొటనవ్రేలు

బొటనవ్రేలి గోరుమీద ఎక్కడనైనా తెల్లనిమచ్చ ఉన్న తలచిన కార్యములు నెరవేరుట, కొత్త కార్యములు ప్రారంభించుటకు ప్రయత్నములు,





నూతన స్త్రీలతో పరిచయము, స్త్రీ సంభోగము, ధనవిషయములో చేయు ప్రయత్నములు నెరవేరుట మొదలగు శుభ ఫలితములు జరుగును.

ఈ మచ్చ నల్లగా ఉన్న స్త్రీ మూలకముగా విరోధములు, చేయు ప్రయత్నములకు ఆటంకములు, బంధువర్గములో విరోధములు, భార్యాభర్తలు యిరువురి మధ్య మనస్పర్థలు కలుగును.

## చూపుడువ్రేలు

చూపుడువేలు గోరుమీద తెల్లని మచ్చ ఉన్న నూతనవ్యక్తులతో స్నేహలాభములు,చేయుకృషియందు అభివృద్ధి ఉండి అనుకో నల్లగా ఉన్నస్నేహబంధుజన విరోధములు, పై అధికారులతో మనస్పర్థలు, ఉద్యోగములో ట్రాన్స్‌ఫర్‌లు ధననష్టము కలుగును.

## మధ్యవ్రేలు

మధ్యవ్రేలి గోరుమీద తెల్లనిమచ్చ ఉన్న వ్యాపారరీత్యా లాభము, నూతనవ్యాపారములు ప్రయత్నించుట, కొత్త సంస్థలలో గౌరవపదవులు పొందుట, సముద్ర ప్రయాణములుచేయుట, అందువలన లాభములు మొదలగునవి మంచి ఫలితములు కలుగును.

ఈ మచ్చ నల్లగా ఉన్న అనుకోనిచిక్కులు ఏర్పడును. నీటిగండము కలుగును. అధికారుల వలన భయం కలుగును. అనుకోని ప్రమాదములకు గురిఅగుట జరుగును. ఉద్యోగములో ట్రాన్స్‌ఫర్‌లు కలుగును.

## ఉంగరపువ్రేలు

ఉంగరపువ్రేలి గోరుమీద తెల్లని మచ్చ ఉన్న ధనలాభము, ఉద్యోగవిషయములో చేయు ప్రయత్నములు అనుకూలించుట, విద్యాభివృద్ధి, పరీక్షలలో జయం, గొప్పవారితో స్నేహం కలుగును.

ఈమచ్చ నల్లగా ఉన్న ధననష్టం, చేయుపనులయందు

ఆటంకములు, విద్యావిషయములో విఘ్నములు, అపజయం, అపకీర్తి కలుగును. పరులకు అపకారము చేయుట యందు కోరిక గలవార్లై ఉండును.

## చిటికెన వ్రేలు

చిటికెన వ్రేలు గోరుమీద తెల్లనిమచ్చ ఉన్న వ్యాపార రిత్యా లాభం, చేయు కృషియందు అభివృద్ధి, నూతన కార్య ప్రయత్నములు జరుగుట బంధువర్గములో గౌరవము కలుగును. గృహమునందు వివాహాది శుభకార్యములు జరుగును.

ఈ మచ్చనల్లగా ఉన్న శరీర ఆరోగ్యము బాగుండ కపోవుట, అప మృత్యుభయం, ఏ మందు పు చ్చుకున్నా వంటబట్టకపోవుట, మొదలగు ఫలములు కలుగును.

# వీపు

వీపుమీద పుట్టుమచ్చ ఉన్న ఆ వ్యక్తి పురుషులలో ఉత్తముడు అగును. గౌరవకుటుంబమునకు సంబంధించిన స్త్రీతో వివాహం అగును. ఈపుట్టుమచ్చ వీపుమీద స్పష్టముగా కొంచెంఎత్తుగా ఉన్న మాటకు విలువ ఎక్కువగా ఉండును. వీపు మీద పుట్టుమచ్చకు శాస్త్రవేత్తలు చాలా ఎక్కువ ప్రాధాన్యతను యిచ్చిరి. ఈ మచ్చ ఎక్కువ శుభఫలితములనే యిచ్చును. ఈ మచ్చ కలవారు ధన, కనక, వస్తు, వాహనములు కలవారు మంచి నడవడిక కలవారు, విద్యావేత్తలు, దైవభక్తి కలవారు ఎల్లప్పుడు మంచివాళ్ళ సహవాసము చేయువారు అయిఉందురు. ఈ మచ్చ ఎర్రగా ఉన్న పైఫలితములు సామాన్యముగా ఉండును, వీరికి గర్వము ఎక్కువగా ఉండును. ఈ మచ్చ నలుపురంగు అయిన చెడు ప్రవర్తన కలిగి, తండ్రి ఆస్తిని పోగొట్టుకొని, నిరుపేదయి అచిరకాలములోనే అకాలమృత్యువుకు గురి అగుదురు. వీపు మీద కుడి ప్రక్కగాని, ఎడమప్రక్కగాని పుట్టుమచ్చ





ఉన్న ఏపని చేయుటలో చొరవ ఉండదు. బద్ధకం ఎక్కువ సోమరులై ఉంటారు.

## వెన్నుమీద

వెన్నుమీద పుట్టుమచ్చ ఉన్న మంచి తెలివితేటలు కలిగి ఉందురు. పదిమందిలో గౌరవ మర్యాదలు, పేరు ప్రఖ్యాతులు ఉండును. గ్రామాలలో ఉన్న గ్రామపెద్దగాను, పట్టణాలలో ఉన్న కౌన్సిలర్‌గాను, చైర్మన్‌గాను, రాష్ట్రస్థాయిలో మంత్రిగానో అయి ఉండును. ఏ సంస్థలో ఉన్న పెద్ద అధికారిగా ఉండును.

## వెన్నుపూస చివర

పిరుదులకు కొంచెం పైని వెన్నుపూస చివరపుట్టుమచ్చ ఉన్న వ్యాయామం చేయుటయందు ఆసక్తి ఎక్కువగా ఉండును. యోగా భ్యాసమున ఆసక్తి కలవారై, మంచిఆరోగ్యము, దీర్ఘాయువు కలిగి ఉందు రు.

## కుడిరెక్కమీద

కుడిరెక్కమీద పుట్టుమచ్చ ఉన్న శరీర ధారుఢ్యము కలిగి ఉందురు. గుండెధైర్యము, చొరవ ఉండును.

## ఎడమరెక్కమీద

ఎడమరెక్క మీద పుట్టుమచ్చ ఉన్న పదిమందిలోగౌరవము పొందును. మాటకారితన ముండును. ఏ పనినైనా నిమిషాల మీద చేసే సామర్థ్యము కలిగి ఉందురు. చెప్పిన పనిని ఆచరణలో పెట్టే శక్తి సామర్థ్యాలు ,చాతుర్యముకలిగివుందురు.

# పిరుదులు

## కుడిపిరుదు

కుడి పిరుదుమీద పుట్టుమచ్చ ఉన్న మంచిదికాదు. తెలివితేటలు,

సమయస్ఫూర్తి ధైర్యము మొదలగు నవి ఏమీ ఉండవు. బంధువర్గము వారితో తరచుగా తగాదాలు కలుగును. సంఘములో గౌరవం ఉండదు. కష్టపడి జీవించ వలసిన స్థితి ఏర్పడును. పశువులు, మేకలు, గొఱ్ఱెలు మొదలగు జంతువులను మేపుకొని జీవితమును గడుపుదురు.

ఎరుపు, తేనె, ఆకుపచ్చ రంగు గల పుట్టుమచ్చ ఉన్న శాంత స్వభావము కలిగి ఉందురు. సామాన్యమైన జీవితము గడుపు దురు. స్వతంత్ర ఆలోచనలు తక్కువ. యితరుల చేతి క్రింద బ్రతుకుట జరుగును.

## ఎడమపిరుదు

ఎడమపిరుదు మీద పుట్టుమచ్చ ఉన్న మంచిది కాదు. ఎంత డబ్బు సంపాదించినా నిలువ ఉండదు. ఎప్పుడు డబ్బు విషయంలో చికాకులు ఏర్పడును. యితరులు వీరికి సహాయం చేసినా వృద్ధిలోనికి రాలేరు.

రెండు పిరుదుల మధ్య:- రెండుపిరుదుల మధ్య పుట్టుమచ్చ ఎక్కడ ఉన్నా అంతమంచిదికాదు. నిరాశ నిస్పృహలతో జీవితము గడుపుదురు. బంధువర్గములోని అంతగా సంబంధ బాంధవ్యాలు ఉండవు. ఎవ్వరితోనూ సఖ్యతగా ఉండరు.

## ఎడమచట్టమీద

ఎడమచట్టమీద పుట్టుమచ్చ ఉన్న పరస్త్రీలయందు ఆసక్తి ఎక్కువ. ఎక్కువమంది స్త్రీలతో సాంగత్యము ఉండును. అతి వ్యభిచారము వలన సుఖ రోగముల తో బాధలు పడుచుందురు.

సాధారణముగా సాష్టాంగ నమస్కారము చేయునపుడు శరీర భాగమునకు, నేలను తగలనిచోట పుట్టుమచ్చ ఉండిన చాలా మంచిది. అన్ని విధముల అదృష్టము కలిసివచ్చును.

పిరుదులమీద పుట్టుమచ్చలు ఉన్న దరిద్ర చిహ్నములు. బాగా కష్టపడిన ధనాదాయము ఉండదు. పుట్టుమచ్చ పచ్చగాఉన్న మంచిది. ఎర్రగా ఉన్న వ్యవసాయమూలముగా ధనార్జన చేయు దురు. నల్లమచ్చ ఉన్న





పశువులు,గొఱ్ఱెలు, మేకలు మొదలగునవి కాసుకొని జీవించును.

## వృషణములు

ఇవి రహస్య అంగములకు చెందినవి. వృషణముల మీద ఎక్కడ పుట్టుమచ్చ ఉన్న సంతానం ఎక్కువగా ఉండును. కుడిభాగమున ఉన్న పుత్ర సంతానముఎక్కువ. ఎడమభాగమున ఉన్న స్త్రీ సంతానము ఎక్కువ. ధైర్యసాహసములు కలవారు యితరులను మోసము చేసి జీవనము గడుపువారగుదురు.

## కుడి వృషణము

కుడి వృషణము మిద పుట్టుమచ్చ ఉన్న చాలా మంచిది. ధనార్జన విషయంలో మంచి నేర్పు కలవారగుదురు. ఏ పని ప్రారంభించినా దినదినాభివృద్ధి పొంది లాభించును. ధనాదాయము బాగా ఉండును. కామవాంఛ ఎక్కువగా ఉండును. పరస్త్రీ సాంగత్యము కోరుచుందురు. దీర్ఘాయుర్దాయము కలవారు అయిఉందురు. వాహనయోగం ఉండును. బంగారు ఆభరణములను ధరించు చుందురు. తనకున్న భాగ్యములో కొంత ఆశ్రితులకు ఖర్చు చేయుచుందురు. వీరికి విచారమనేదే ఉండదు. బంధుమిత్రులతో సఖ్యతగా ఉంటారు.

## ఎడమవృషణము

ఎడమవృషణము మీద పుట్టుమచ్చ ఉన్న ఉన్నదానితో సంతృప్తి పొందుట జరుగును. బంధుమిత్రులలో కలిసి మెలసి ఉందురు. శరీరారోగ్యము బాగుండును. పరస్త్రీలయందు భయభక్తులతో ఉందురు. అనవసర విషయాలలో కల్పించుకోరు. బంధుమిత్రులతో మెప్పును సంపాదింతురు. సాఫీగా జీవితము కొనసాగుచుండును.

## వృషణముల క్రింద

వృషణముల క్రిందభాగమున అనగా పైకి కనిపించని భాగమున పుట్టుమచ్చ ఉన్న కామోద్రేకం అధికముగా ఉండును. అన్ని రకముల భోగములు అనుభవించుచుందురు. ఒక దశలో జీవితముపై

వైరాగ్యభావము కలిగి భార్యబిడ్డలను విడచిపెట్టి సన్యాసులలో కలిసిపోవుదురు. పుణ్యక్షేత్రములను దర్శించు భాగ్యము కలుగును. దైవప్రచారము కొరకు జీవితమును అంకితము చేయుదురు.

## వృషణాలకు కుడిభాగమున

వృషణములకు కుడిభాగమున పుట్టుమచ్చ ఉన్న పుత్ర సంతానము ఎక్కువ. ఎడమభాగమున పుట్టుమచ్చ ఉన్న స్త్రీ సంతానము ఎక్కువ.

## లింగము

పురుషునకు రహస్య అంగమైన లింగము మీద పుట్టు మచ్చఉన్న ప్రతి చిన్న విషయములోను సంతృప్తిని. ఆనందమును పొందుచుందురు. వీరికి మనస్సులో స్త్రీల యెడ విపరీతమైన వాంఛ ఉండును. కామోద్రేకము ఎక్కువగా ఉండి సామాన్య జీవితమును గడుపుదురు.

వీరుచిన్నతనములో సుఖము అనుభవించితే పెద్దయ్యాక కష్టములు పొలగుదురు. చిన్నతనములో కష్టములు అనుభవించితే పెద్దయ్యాక సుఖములు పొందుదురు.

ఈ మచ్చ నలుపురంగు వర్ణము కలది అయిన పై గుణములు పదిరెట్లుగా ఉండును. ఈ మచ్చ లింగమునకు దిగువ ప్రదేశమున ఉన్న పుట్టినది మొదలు మరణించుట వరకు నిత్యదరిద్రుడగును.

## తొడలు

## కుడితొడ

కుడి తొడమీద పుట్టుమచ్చ ఉన్న విశేషమైన సంపదలు కలవాడై ఉండును. అనుకూలమైనభార్య లభించును. స్త్రీ మూలముగా ధనము లభించును. అనగా భార్యవలన గాని, యితర స్త్రీల వలనగాని సంపద చేకూరును. సరిగ్గా తొడ మీద పుట్టుమచ్చ ఉన్నను స్త్రీలు వట్టుటయందు నేర్పరితనము కలవాడై ఉండును. దాని వలన





సంపాదన కలుగును. ఆరోగ్యవంతుడై పదిమందిలో గౌరవ మర్యాదలతో సంచరించుదురు. ఒక్కొక్కప్పుడు వీరికి విదేశీ ప్రయాణము కలుగును. విదేశాలలో పేరు ప్రఖ్యాతులు పొందుదురు. బాగా ధనము సంపాదించి సమస్త భోగములు అనుభవించును.

## ఎడమతొడ

ఎడమతొడ మీద పుట్టుమచ్చ ఉన్న అంత మంచిదికాదు. వీరికి జీవితంలో సౌఖ్యం ఉండదు. బద్ధకం ఎక్కువ. యితరుల మెప్పును సంపాదించక వారిచే నిందింప బడును. చేతిలో డబ్బు లేక చాలా బాధలు పడుచుందురు. కామోద్రేకము ఎక్కువ. రాత్రులందు సంచరించుచుందురు. పగలు నిద్రపోవును. వీరికి ఏదోఒక విద్యయందు ప్రవేశముండును. కాని ప్రావీణ్యత ఉండదు. యితరుల మనస్సును బాధ పెట్టుచుందురు. నీచస్త్రీలనిన ఎక్కువ మక్కువ కలిగిఉందురు. వారి కోసం ధనమును పోగొట్టుకొని తనవారి నందరిచే ద్వేషించబడుదురు.

## గజ్జలు

గజ్జలయందు పుట్టుమచ్చ ఉన్న అంత మంచిదికాదు. స్వతంత్ర ఆలోచనలు తక్కువ. యితనికి గల చెడుగుణములచే దరిద్రుడగును. ధనం లేనపుడు చెడుపనులు చేయుటవలన యితరుల మన్ననలను కోల్పోవుదురు. తల్లితండ్రులకు ఉన్న పేరు ప్రతిష్టలు వీరికి ఉండవు. ఉన్న ఖ్యాతిని, ధనమును కోల్పోవుదురు. దారిద్రముచేత బాధింపబడుదురు. బంధుమిత్రుల ఆదరణ లభించదు.

బొడ్డునకు పై భాగమును ఊర్ధ్వ భాగమనియు, క్రిందభాగమును అధో భాగమనియు అందురు. ఈ రెండు భాగములయందు ఉబ్బెత్తుగా ఉండి, మంచి రంగుగానుండిన మచ్చలను తీసుకొని వాటియొక్క మంచి చెడ్డలను సమన్వయపరచుకొని ఫలితములు చెప్పవలెను.

## పిక్కలు

కుడికాలు పిక్కమీద పుట్టుమచ్చ ఉన్న వారికి పట్టుదల ఎక్కువ. ఏ పని ప్రారంభించినా అది అయ్యేవరకు నిద్రపోరు. మేధా సంపత్తి, చురుకుదనము ఎక్కువగాఉండును. జీవితములో పేరు ప్రఖ్యాతులను పొందుదురు.

ఎడమకాలి పిక్కమీద పుట్టుమచ్చ ఉన్న ధనవిషయంలో బాగానే ఉండును అన్ని వర్గములవారితో కూడా స్నేహము లభించును. తరచుగా ప్రయాణములు చేసే ఉద్యోగము లభించును.వ్యాపార సంస్థలలో రిప్రజంటేటివులుగా ఉందురు. వీరికి బంధుమిత్రులు ఎక్కువగా ఉందురు. వీరుచేయు పనులయందు అశ్రద్ధ ఎక్కువ. వీరు ముందు ఆలోచనలు లేకుండా ఒక్కొక్కప్పుడు పనులుచేసి దానివలన నష్టపడతారు.

## కుడిమోకాలు

కుడిమోకాలు మీద పుట్టుమచ్చ ఉన్న ధనార్జన చేయుటలో మంచి నేర్పరితనము కలిగి ఉందురు. వాహన యోగం ఉండును. రాజకీయ వ్యవహారములలో ప్రవేశం ఉండును. అనుకూలమైన దాంపత్యం ఉండును. పరస్త్రీల వలన సుఖసౌఖ్యములు పొందురు.

## ఎడమమోకాలు

ఎడమ మోకాలి మీద పుట్టుమచ్చ ఉన్న మధ్య మధ్య ఆర్థిక యిబ్బందులు పడుచుందురు. తేలికబుద్ధి, అలప సంతోషి, ఒకమాదిరి సంపాదన ఉండును. పనికిరాని స్త్రీల యొక్క స్నేహము,సాంగత్యము ఉండును, వీరియొక్క సూటిపోటిమాటలవలన యితరుల మనస్సు బాధపడిలేనిపోని శతృత్వము ఏర్పడును.

నవగ్రహములకు, వ్యక్తులయొక్క శరీరము మీద గల పుట్టుమచ్చలకు గల కొంత సంబంధము కలదు. ఏ మనిషి శరీరము మీదనైనా బాదము పప్పు రంగులో పుట్టుమచ్చ ఉన్న ఆ వ్యక్తి రవివ్యక్తి అనియు,





తెలుపురంగులో ఉన్న చంద్రవ్యక్తి అనియు, చామనచాయరంగులో ఉన్న బుధవ్యక్తి అనియు, ఎరుపురంగులో ఉన్న కుజవ్యక్తి అనియు పసుపుపచ్చరంగులో ఉన్నశుక్రవ్యక్తి అనియు, నీలిరంగులో ఉన్న గురు వ్యక్తి అనియు, నలుపురంగులో ఉన్న శని వ్యక్తి అనియు మనము గ్రహించవలెను. రాహు,కేతువులు ఛాయాగ్రహాలమగుటచే వాటికి ప్రత్యేక రంగులు లేవు.

# చీలమండలు

## కుడికాలుచీలమండ

కుడికాలి చీలమండకు కుడి భాగమున పుట్టుమచ్చ ఉన్న దూరాలోచన కలిగి ఉందురు. సభల యందు ధైర్యముగా ఉపన్యసించెదరు. సమయస్ఫూర్తితోనే మాట లాడుచుందురు. వాగ్ధాటి ఎక్కువ. దానధర్మములు చేయుట యందు ఆసక్తి ఉండును.

ఈ మచ్చ కుడికాలి మండకు ఎడమభాగమున ఉన్న దైవభక్తి, బంధు ప్రేమ కలిగి ఉండును. ఆర్థికపరమైన యిబ్బందులు ఏమీ ఉండవు సంపాదనమామూలూగాఉండును. గుట్టుగా కాలక్షేపము చేయును.

## ఎడమకాలి చీలమండ

ఎడమకాలి చీలమండకు కుడిభాగమున పుట్టుమచ్చ ఉన్న గౌరవాధికారములు, కీర్తి, గొప్పవారితో స్నేహము, దైవభక్తి, ఆచార వ్యవహారములు ఉండును. బంధుప్రీతి ఎక్కువగా ఉండును. తనకంటే ఎక్కువ స్థితిలో ఉన్నవారితో స్నేహము చేయాలనే కోరిక ఉండును. పెద్దగా స్థిరమైన ఆస్తులు సంపాదించలేకపోయినా భుక్తికి మాత్రం లోటుండదు. సామాన్య జీవనము చేయును.

ఈ మచ్చ ఎడమకాలి మండకు ఎడమభాగమున ఉన్న సంఘములో గౌరవము ఉండదు. యితరులకు నష్టం కలిగించే పనులం

చేయుచుందురు. చెడు స్నేహములు, గౌరవ ప్రతిష్ఠలకు భంగముఏర్పడును. కోర్టు వ్యవహారములలో యిరుక్కొనుట, శిక్షింపబడుట జరుగును. ధనము సామాన్యముగా ఉండును. సంఘములో ఎటువంటి విలువ ఉండదు. ఏ కాలియందైననూ పుట్టుమచ్చ ఉన్న మంద బుద్ధిగలవాడు, వివేకము లేనివాడు, కులభ్రష్టుడు అగును.

----------

పుట్టుమచ్చల యొక్క ఫలితములను చెప్పునపుడు భయోత్పాత మును కలిగించు ఫలితములను చెప్పకూడదు. ఫలితములను చెప్పుటలో తొందరపడక బాగా ఆలోచించుకొని చెప్పవలెను. పాత్రానుసారమును బట్టి ఫలితములను చెప్పవలెను.

కొందరి శరీరముల మీద కురుపుల మచ్చలు, కాలిన మచ్చలు ఉండును. అటువంటి వానికి ఫలితములు లేవు. అందుచేత వానిని జాగ్రత్తగా పరిశీలించి విడిచిపెట్టవలెను.

# పాదములు

పాదములందు పుట్టుమచ్చ ఉన్న గజతురగము మొదలైన వాహనములు ఉండును.

## కుడికాలిపాదం

కుడిపాదమునకు కుడిభాగమున పుట్టు మచ్చ ఉన్న అనుకూలమైన భార్య లభించును. సంసార సుఖం ఉండును. వేదాంతమునకు సంబంధించిన విషయం లలో ఆసక్తి ఎక్కువ. మంచివారితోస్నేహము దొరుకును. ఏ విషయమునైనా పూర్తిగా ఆలోచించే శక్తి సామర్థ్యాలు కలిగి ఉందురు. సంసారము సుఖముగా ఉండును. సంసారములో ఏ విధమైన లోటుపాట్లు ఉండవు. భార్యాతోనే ఉందురు.

ఎడమభాగమున ఉన్న సామాన్యముగా ఉండును. సంపాదన





అంతంతమాత్రమే ఉండును. ఉన్నదానితోనే తృప్తిని పొందుదురు మంచివారు, ఉత్తముల స్నేహసహకారములు వీరికి లభించును.

## ఎడమకాలిపాదం

ఎడమకాలి కుడిపాదమున పుట్టుమచ్చ ఉన్న భార్యతో విరోధము ఏర్పడును. బంధువులు కూడా అతనిని యిష్ట పడరు. భార్యాభర్తల మధ్య అనురాగము తక్కువగా ఉంటుంది. అహంకారము కలిగి ఉంటారు. మామలు సుఖమును పొందు దురు. ఓ మాదిరి జీవితమును గడుపుదురు. తమ సుఖముల కోసం ఏపనిచెయ్యటానికి అయినా సిద్ధపడుదురు.జీవితంలో ఎన్ని కష్టములు కలిగిననూ సంపద పెరుగుటకాని, ఆనందం కలగటంకాని జరుగదు. జీవితంలో సుఖంతక్కువ.యితరులను తేలిక భావముతో చూచు చుందురు.

ఎడమకాలిపాదమునకు ఎడమవైసపున పుట్టుమచ్చ ఉన్న అంత మంచిదికాదు. బంధుమిత్రుల అభిమానమును కోల్పోవుదురు. సంసారయోగము ఉండదు. స్థిరమైన నివాసము ఉండదు. స్థిరముగా ఒకచోట ఉండక, ఆరోగ్యమును కోల్పోయి స్థిర నివాసంలేకుండా సంచరించుదురు. స్థిరమైన సంపాదన ఉండదు.

# అరికాలు

## పాదము క్రింద

పాదముక్రిందభాగమున అనగా అరికాలి యందు పుట్టుమచ్చ ఉన్న చంచలమనస్సు కలవారై ఏపని యందు స్థిరముగా ఉండక ఆలోచనలతో కాలుకాలిన పిల్లిలా ఎటుపడితే అటు తిరుగుచుందురు. నీచ స్త్రీలయందు వ్యామోహము కలిగి సామాన్యమైన సంపాదన ఉండును.

అరికాలు మధ్యలో పుట్టుమచ్చ ఉన్న సంగీత, సాహిత్యము

అందుప్రవేశము ఉండును. గాయకుడుకాని,కవిగాని అగుదురు. తన అంతస్థుకన్న తక్కువ అంతస్థుగల స్త్రీలతో రహస్య సంబంధములు కలిగి ఉందురు. వారి కోసం ధనమును ఖర్చు చేయుదురు.

అరికాలుమడమ మీద పుట్టుమచ్చ ఉన్న వాహనసుఖము ఉండును ఎల్లప్పుడు ప్రయాణములు చేయుచుందురు.

కాలివ్రేళ్ల క్రింద పుట్టుమచ్చ ఉన్న శతృవులు ఎక్కువగా ఉందురు. తక్కువ వారితో స్నేహము చేయుట వలన అపకీర్తి పొందుట, ధనము ఖర్చగును. దురాశ, లోభత్వం ఎక్కువగా ఉండును. యితరులను తేలికభావముతో చూచుచుందురు. నిరసనభావం, అసహనం, అసంతుష్టి ఉండును, వీరు చిన్నతనమున కష్టములను పొందినా తర్వాత క్రమేణా సుఖములు పొందుదురు. పుత్రసౌఖ్యం ఉండదు.

కాలిబొటనవ్రేలు క్రింద వుట్టుమచ్చ ఉన్న మంచి తెలివితేటలకలిగి,బంధువర్గమువారి సహాయ సహకార ములతో క్రమేణా అభివృద్ధిలోనికి వచ్చుదురు. బంధువులను తన చెప్పుచేతలలో ఉంచుకొందురు.

పాదముల క్రింద పుట్టుమచ్చ ఉన్న స్త్రీ లోలుడగును. నీచస్త్రీ సాంగత్యము ఉండును. కామోద్రేకము ఎక్కువగా ఉండును.

కుడికాలి బ్రొటన వ్రేలు క్రింద పుట్టుమచ్చ ఉన్న ధనాదాయము లేకుండుట, మరియు అపకీర్తి కలుగును.

రెండవ వ్రేలి క్రింద పుట్టుమచ్చ ఉన్న బంధువులతో విరోధములు ఎక్కువగా ఉండును.

మధ్యవ్రేలి క్రింద పుట్టుమచ్చ ఉన్న మనస్సు చంచలముగా ఉండును

నాల్గవవ్రేలిక్రిందపుట్టుమచ్చఉన్న యితరుల సుఖసౌఖ్యముల కొరకు పాటుపడుచుందురు.

చిటికెన వ్రేలు క్రింద పుట్టుమచ్చ ఉన్న పుత్ర సంతానము ఎక్కువగా ఉండును.







## స్త్రీలకు పుట్టుమచ్చల ఫలితములు

## రెండు కనుబొమలు కలిసేచోట

సకలములైన ఐశ్వర్యములు కలిగి, అణుకువగలిగిన భర్త, మంచి సంతానము కలిగి ఉంటారు. జీవితములో చింత,విచారము ఎరుగక సుఖ సంతోషాలు పొందగలరు. అందరి మన్ననలను పొంది గౌరవింపబడగలరు. ఎరుపురంగుమచ్చలు ఎల్లప్పుడు శుభకరమయినవే. స్త్రీలకు చేతులమీద, నుదుటిపైన, కుచములపై ఎక్కడైనా ఎరుపురంగు పుట్టు మచ్చ ఉన్న చాలా మంచిది. పుత్ర సంతానము కలిగి ఉంటారు. సకలమయిన సుఖములు అనుభవించేందుకు ధనము, అవకాశము కలిగి ఉంటారు.

## నుదుటికుడిభాగమున పుట్టుమచ్చ ఉంటే

ఎరుపురంగు చాలా మంచిది. వీరి భర్త సంపాదన కలిగి విశేషంగా సుఖపెట్టగలరు. నలుపురంగు మచ్చ అయినా అహంకారం గల స్త్రీ అయి, ఎవరిమాటా లెక్కచేయక, భర్తనుసైతం లెక్కచేయక వారి మాటే వేదంగా వుంటారు.

## నుదుటిఎడమభాగమునపుట్టుమచ్చఉంటే

నుదటి ఎడమభాగంలో పుట్టుమచ్చ ఉంటే ఏ మాత్రం మంచిది కాదు. బంగారమయినా మట్టిగా మారగలదు. తమకి దేవుడే కష్టాలు కలిగిస్తున్నాడని భావన వీరిలో ఉంటుంది. అదే మచ్చ తేనె రంగులో ఉంటే ప్రపంచంలోని కష్టాలు వీరి సొంతం.

## కణత భాగంలోపుట్టుమచ్చ ఉంటే

కణతపై భాగమున పుట్టుమచ్చ ఉంటే నుదురు భాగమునే ఎడమకణతపై భాగమున పుట్టుమచ్చ ఉంటే అది ఎరుపురంగుదయినా మంచి ప్రవర్తన కలిగి అందరి మన్ననలను పొందగలరు. అదే నలుపు రంగు దయిన చెడు ఆలోచనలతో, చెడ్డవారితో స్నేహం చేసి నీచ

ప్రవర్తన కలిగి వుంటారు.

## కుడికణతమీద పుట్టుమచ్చ వుంటే

కుడి కణతపై భాగమున ఎర్రటి పుట్టుమచ్చ ఉంటే మంచి ప్రవర్తన కలిగి ఉంటారు. భర్తమాటపై విశ్వాసం కలిగి భర్త అడుగుజాడల్లో జీవిస్తారు. అదే నల్లమచ్చ అయిన సామాన్య జీవనము గడపగలరు.

## ఎడమచెక్కిలి యందు పుట్టుమచ్చ ఉంటే

ఎడమ చెక్కిలియందు పుట్టుమచ్చ వున్న స్త్రీలు చేతినిండా డబ్బు కలిగి భోగలాలసకి అలవాటు పడి భోగజీవితము గడుపుతారు

## ఎడమకంటిపై పుట్టుమచ్చ వుంటే

ఎడమకంటిలో తిలకం మాదిరిగా మచ్చ వున్న ఆ స్త్రీ ఒడిదుడుకులు లేని జీవితము గడుపుతుంది. భర్తతో వున్నా ఎక్కువగా ఒంటరి జీవితము గడపవలసి రావచ్చును.

## నెత్తిపై పుట్టుమచ్చ వుంటే

నెత్తిపై పుట్టుమచ్చ వుండటం మంచిదికాదు. దుష్ట స్వభావము కలిగి ఉంటారు.

# పెదవులు

పై పెదవిపై పుట్టుమచ్చ వుంటే ఆమె మూలంగా కుటుంబానికి మేలే జరుగుతుంది. సుగంధ ద్రవ్యాలపై మక్కువ కలిగివుంటారు. కామోద్రేక స్వభావము కలిగి భర్త నుండి అధిక సుఖము, ప్రేమ పొందగలరు. వాక్చాతుర్యము కలిగి అందరితో కలుపుగోలు స్వభావము కలిగి బంధువుల్ని స్నేహితుల్ని ఆదరిస్తారు. దైవభక్తి కలిగి పూజలు, వ్రతాలు ఆచరిస్తారు. క్రింద పెదవిపైన పుట్టుమచ్చ వుంటే ఆమెకి భోజన ప్రియత్వము ఎక్కువ. 'రకరకాల రుచికర వంటలుచేసి తింటారు. అధిక మయిన కామ వాంఛ కలిగి వుంటుంది. మంచి స్నేహితురాళ్ళు కలిగి వుంటారు. క్రింద పెదవి మీద పుట్టుమచ్చ వుంటే అందరితో కలహించటం, ఇష్ట ప్రకారంగా మాట్లాడి





ఇతరుల్ని నొప్పించటం, దుష్ట స్వభావంతో సంచరించి ఇతరులకు ఇబ్బందులు కలుగజేస్తారు.

# నాలుక

నాలుకపై భాగములో పుట్టుమచ్చ వుంటే సంగీతములో ప్రావీణ్యత వుండే అవకాశములు ఎక్కువ. దైవభక్తి అధికం. అదే నాలుక క్రింద భాగంలోవుంటే ధనధాన్యములు సమృద్ధిగా వుంటాయి. ఎక్కువగా పూజలు, వ్రతాలు చేయటం, పుణ్యక్షేత్రాలు తిరగటం,దైవ దర్శనం చేసుకోవటం దైవ కార్యాలకి అమితంగా ఖర్చు చేస్తారు.

# దవడ

## ఎడమ దవడమీద పుట్టుమచ్చ వుంటే

సామాన్య జీవితము కలిగి ఎదుటి వారిని నొప్పించక సామాన్యంగా మాట్లాడి, బంధు మిత్రులతో మంచి సంబంధాలు కలిగి వుంటారు.

## కుడి దవడ మీద పుట్టుమచ్చ వుంటే

అంత మంచిది కాదు. జీవితములో కష్ట నష్టములు ఎదురు కాగలవు. అనారోగ్యము, ఆర్థిక యిబ్బందులు కలిగే అవకాశము ఎక్కువ.

# గడ్డము

గడ్డముపై పుట్టుమచ్చ వుంటే నెమ్మదస్తురాలై వుంటుంది. తన వల్ల భర్త సంపాదించి తాము ధనవంతులయ్యే అవకాశ ములు ఎక్కువ. భార్యాభర్తలు అన్యోన్యముగా వుండి సుఖ సంతోషాలు పొందగలరు. సౌఖ్య జీవితము, ధన సమృద్ధి, భర్త ప్రేమానురాగాలు కలిగిన స్త్రీకి అంతకాన్న ఏమి కావాలి. స్త్రీ గడ్డము పై పుట్టుమచ్చ శుభసూచితం

# ముక్కు

ముక్కు మీద పుట్టుమచ్చ వుంటే ఆ స్త్రీ అనుకున్న పనులు చేయుట

యందు ఆసక్తి పట్టుదలా కలిగి వుంటుంది. ముక్కు చివరి భాగములో ఎర్రని పుట్టుమచ్చ వున్న ధనవంతురాలై సకల సౌఖ్యాలు అనుభవించగలదు. ఆమెకి కలిగిన సంతానము అభివృద్ధి పథంలో నడిచి కీర్తి ప్రతిష్టలు నార్జించగలరు.

అదే మచ్చ నల్లగా వుంటే భోగభాగ్యాలు వుండవు. మనస్సు ప రిపరివిధాల పరుగెత్తి పిరికి కాగల అవకాశముంది. కుడిభాగం లో వుంటే సామాన్య జీవితము గడపగలదు.

# వక్షములు

## కుడి స్తనము మీద పుట్టుమచ్చ వుంటే

కుడి స్తనము మీద పుట్టుమచ్చ వుంటే ఆరోగ్యం బాగుండి, మంచి సంతానము కలిగి వుంటారు. ఎడమ స్తనము మీద పుట్టుమచ్చ వుండిన పూర్ణ ఆయుర్దాయము కలిగి వుంటారు. ధన సమృద్ధిగా వుంటారు. బంధుమిత్రులతో సత్సంబంధాలు కలిగి ప్రశాంత జీవనము గడపగలరు.

## ఎడమకుచము మీద ఎర్రని పుట్టుమచ్చ

ఎడమకుచము మీద ఎర్రని పుట్టుమచ్చ వుంటే సంతానము కలిగిన వెంటనే భర్త దూరము కాగల అవకాశములు కలవు. కుడి భాగము మీద తిలకముంటే అందరినీ కించపరచటం, నలుగురిలో చెడ్డపేరు, మితంగా భుజించటం, స్వల్ప సంతానం, కలుగగలదు. కుడి కుచంమీద పుట్టుమచ్చ వుంటే సంతాన ముఎక్కువగా వుండి సామాన్య జీవితము గడపగలరు. బంధు ప్రీతి, దైవభక్తి ఎక్కువ. జీవితము సామాన్యముగా వుంటుంది.

## ఎడమకుచముఎడమభాగములోపుట్టుమచ్చ

ఎడమకుచము ఎడమభాగములో పుట్టుమచ్చ వుంటే బంధు మిత్రులతో విరోధము, డబ్బుకి ఇబ్బందులు, భోగలాలసపై అనురక్తికలిగి వుంటారు.





ఎడమభుజము కుడి భాగములో వుంటే ఏ ఇబ్బందులు లేక జీవితము సాఫీగా సాగుతుంది. ఇతరులతో సలహా సంప్రదింపులుచేస్తారు.

## కుడి కుచము మధ్యలో పుట్టుమచ్చ

కుడి కుచము మధ్యలో పుట్టుమచ్చ వుంటే చిన్నతనంలో వివాహం జరిగి సంతానవతికాగలదు. భర్త అంటే గౌరవ మర్యాదలు కలిగి సౌమ్యంగా మాట్లాడి మంచిదనే అనిపించు కుంటుంది. బంధుమిత్రుల మన్నన పొందగలదు.

## స్తనముల అడుగుభాగములో పుట్టుమచ్చ

స్తనముల అడుగుభాగములో పుట్టుమచ్చ గల వారికి అధిక కోపం, పెంకితనం, చెడు ప్రవర్తన, బుద్ధి స్థిమితములేక పోవటం జరుగుతుంది. స్తనములకి పై భాగములో పుట్టుమచ్చ గలవారికి ఇతరులను చిన్నబుచ్చటం,గొప్పగా జీవించాలనే ఆసక్తి కలిగివుండటం, చంచల స్వభావం , ధన యిబ్బందులు,ఇతరుల సంపాదనపై దృష్టి కేంద్రీకరించటం లాంటి లక్షణములు కలిగివుంటారు.

## చంకలు

కుడి చంకలో పుట్టుమచ్చ కలిగిన వారికి కామోద్రేకము అధికముగా వుండే అవకాశముంది. జీవితమే కామంతీర్చుకునే తత్వంలో వుంటారు. ఎంత అనుభవించినా ఇంకాఏదో అసంతృప్తి ఆమెను వెన్నాడుతుంది.

ఎడమచంకలో పుట్టుమచ్చగలవారికి ధనలాభము, సంతానవృద్ధి, బంధుప్రీతి, సంపూర్ణఆయుర్దాయం ఇతరులకు ఉన్నంతలో సహాయం చేసే అలవాటుకలిగి సుఖసంతోషాలతో జీవింపగలరు.

## భుజములు

పుట్టుమచ్చ కుడిభుజంపై గలవారు ధిక్కార స్వభావము కలిగి బంధుమిత్రులతో అనవసరతగాదాలు కల్పించుకుంటారు. జీవితంపై ఎన్నో ఆశలు పెంచుకుని జీవితం నాశనం చేసుకుంటారు. తమ సుఖసంతోషాలకి భర్త పిల్లలపై చిరాకు కలిగి వుంటారు. లేనిపోని ఆశలకి

పోయి జీవితాన్ని నరకప్రాయం చేసుకుంటారు.

పుట్టుమచ్చ ఎడమభుజంపై గలవారికి చేతి నిండా ధనము కలిగి వుంటారు. మనస్సులో పరిమితమయిన కోరికలు కలిగి వుంటారు. సుఖ జీవితము గడుపుతారు. స్త్రీ సంతానము అధికము. ఏ చేతిమీదనైనా దోమ ఆకారంలో పుట్టుమచ్చ ఉంటే మొదట పుత్ర సంతానము కలుగుతుంది. జీవితము సుఖసంతోషాలతో గడపగలరు.

పుట్టుమచ్చ మోచేతిమీద వుంటే తలబిరుసుతనం ఎక్కువ. గర్విష్ఠిగ వుంటారు. మొదట్లో కష్టాలు అనుభవించినా ధైర్యముగా నిలబడే స్వభావము కలిగినవారవటం చేత సుఖాన్ని అను భవించగలరు. తనని తాను రక్షించుకోగలరు. ఆత్మవిశ్వాస మధికం. సంసారముపై విశేషమయిన ఆసక్తి కలిగి వుంటారు. ఎన్ని వడిదుడుకులెదురైనా ఎదు ర్కొని జీవితము సుఖమయం చేసుకోగలరు.

## చేతులు

చేతులపై దోమ ఆకారంలో పుట్టుమచ్చ ఉంటే మొదట పుత్ర సంతానము కలుగుతుంది. సంగీత సాహిత్యాలలో ప్రావీణ్యం కలిగి ధనము, కీర్తి, ప్రతిష్ఠలు సుఖసంతోషములు కలుగును. భోగ విలాస జీవితము గడపగలరు.

అరచేతులలో పుట్టుమచ్చ వుంటే అనేక విద్యలందు ప్రావీణ్యత సంపా దించగలరు. కీర్తి ప్రతిష్ఠలు కలిగి ధనమూ సంపద కలిగి సుఖ సంతోషాలు పొందగలరు. జీవితము లోటు లేకుండా సాఫీగా సాగుతుంది.

మోచేతిపై పుట్టుమచ్చ గలవారు ధైర్యం కలిగినవారై అన్ని విషయ ములు తెలిసినవారై సంసారంలో అందరియెడ సఖ్యత కలిగి, కుటుంబ మును అభివృద్ధి పథంలో నడిపిస్తారు.

ఎడమ మణికట్టుపై పుట్టుమచ్చ కలిగినవారు అల్లికపనులు, ఎంబ్రా యిడరీ, కుట్టుపనులు లాంటి చేతి పనులుపై ఆసక్తి చూపుతారు, స్వశక్తిపై నమ్మకం ఎక్కువ. వారి జీవితము సాఫీగా సాగుతుంది.





## పొట్ట

పొట్టమీద పుట్టుమచ్చ గలవారు తీపి పదార్థాలపై ఆసక్తి కలిగి వుంటారు. శీలవతి సంతానవతి కాగలరు.

పొట్టపై ఎడమవక్షం క్రింద పుట్టుమచ్చ గల స్త్రీలు బాల్యంలో వితంతువులు అయ్యే అవకాశములు ఎక్కువగా ఉన్నాయి.

బొడ్డుపై పుట్టుమచ్చ కలిగినవారు అందరినీ నిందించే స్వభావము కలిగి వుంటారు. సంపదలు సమృద్ధిగానే వుంటాయి. వీరు సుఖసంతోషాలతో కాలం గడపగలరు.

## పిరుదులు

పిరుదులపై పుట్టుమచ్చ ఉండటం మంచిదికాదు. కుడి పిరుదుపై పుట్టుమచ్చ వుంటే ధన హీనత్వము చేత సేవకవృత్తి చేసుకొని జీవించే అవకాశము ఎక్కువ. విరాగిలా బ్రతకగలరు. అదే మచ్చ ఎరుపురంగు గలదైన అవసరాలకి తగిన ధనము సమకూరగలదు. పెంపు డుజంతువులను పెంచాలనే ఆసక్తి కలిగి వుంటారు ఈ మచ్చ బంగారు వర్ణముతో వుంటే లోటులేకుండా ప్రధానంగా సేవికావృత్తిలోనే జీవించగలరు. వీరికి జీవితములో ధనసంబంధ ఇబ్బందులు ఎదురుకావు.

## తొడలు

కుడి తొడపై పుట్టుమచ్చ వుంటే అనుకూలమైనభర్త, చక్కటి సంసారం అన్నవస్త్రాదులకు కొరతలేక సుఖజీవనము సాగిస్తారు. ఆర్థిక పరమయిన ఇబ్బందులుండవు. ఎడమతొడపై పుట్టుమచ్చ వుంటే కామోద్రేకం అధికముగా కలిగి వుంటారు. ఎంత సుఖమనుభవించినా ఇంకా కావాలనే తపన కలిగి వుంటారు.

ధనధాన్యములకు లోటు లేకుండా సుఖజీవనము సాగించగలరు. సుగంధ ద్రవ్యాలపై మోజు అధికము. భోగలాలస జీవితముపై ఆసక్తి కలిగి ఆడం బరానికి ధనవ్యయం చేస్తారు.

రెండుపిరుదుల మధ్య పుట్టుమచ్చ వుంటే జీవితంలో సుఖశాంతులు

తక్కువ . ఆశలపై జీవించి ఇబ్బందులు పడగలరు. వీరు గాలిలో పేక మేడలు కట్టడం, ఊహాసౌదాలలో కాలం వెళ్లబుచ్చుతారు. వీరు తలంచిన కార్య ములు నెరవేరక ఆర్థికపరమయిన ఇబ్బందులు లెదుర్కొంటారు.

**యోని**

మర్మస్థానములో కుడిభాగమున పుట్టుమచ్చ వుంటే అన్ని విధాలా మంచిది. ధన వాహనలాభం, సంతానము, బంధుప్రీతి కలిగి వుంటారు. భోగలాలస జీవితము గడుపుతారు, అలంకరణపై శ్రద్ధ ఎక్కువ. అందరితో మర్యాదగా ప్రేమగా వుంటూ అందరి మన్ననలు పొందగలరు.

మర్మస్థానములో ఎడమభాగమున పుట్టుమచ్చ వుంటే అన్ని విధాలా మంచిదికాదు- వీరికి అసంతృప్తి, ఇంకా కావాలనే కోరిక కలిగి మనశ్శాంతి వుండదు. వీరికి జీవితం నిస్సారంగా వుంటుంది.

**మోకాళ్ళు**

కుడిమోకాలిపై పుట్టుమచ్చ వున్నవారు కుటుంబాలలో ముఖ్య పాత్రపోషిస్తారు. మంచి సలహాలు ఇచ్చే నేర్పు కలిగి వుంటారు.భర్తపై ప్రేమ, గౌరవం, సత్ప్రవర్తన కలిగి అందరిచేత గౌరవింపబడుతుంది.

ఎడమ మోకాలుపై పుట్టుమచ్చవున్నవారు భర్తను తనమాటల ద్వారా చేతలద్వారా వశపరచుకొని వీరే పెత్తనం చెలాయిస్తారు. అందరినీ తన అదుపుఆజ్ఞలలో వుంచుకుంటారు, దైవభక్తి కలిగి వుంటారు. దైవ కార్యములకు అధిక ప్రాధాన్యము ఇవ్వగలరు. అందరికీ సహాయం చేయాలనే తలంపు కలిగి వుంటారు.

**చీలమండ**

ఎడమ చీలమండకి ఎడమభాగములో పుట్టుమచ్చ కలిగినవారు ఆత్మస్థైర్యము కలిగి కష్టపడే తత్వము కలిగి వుంటారు. బంధుప్రీతి కలిగి, అందరిని ఆదరిస్తారు, వీరికి జీవితము సుఖసంతోషాలతో గడుస్తుంది. వీరి వైవాహిక జీవితము ఆనందమయముగా గడుపుతారు. కుడి కాలి చీలమండకి





కుడిభాగంలో పుట్టుమచ్చ ఉన్నవారు అధిక కోపం కలిగి, ధిక్కారంగా మాట్లాడి అందరిచేత హీనముగా చూపబడతారు. చెడుతలంపులు, దుష్టుల సహావాసము, చెడు ప్రవర్తన కలిగి,బుద్ధి స్థిరముగా లేక జీవితములో అనేక కష్ట నష్టములనుభవించగలరు. కుడికాలి చీలమండకి ఎడమభాగంలో పుట్టుమచ్చగలవారు నిష్టూరంగా మాట్లాడి అందరితో విరోధము కలిగి ఆర్థిక యిబ్బందులతో సతమతమవుతారు.

**పాదములు**

ఎడమ పాదము ఎడమవైపు పుట్టుమచ్చ వుంటే అన్న వస్త్రాదులకు లోటు వుండదు. దైవభక్తి అధికముగా వుంటుంది. దైవ కార్యాలకి ధనవ్యయము విపరీతముగా చేస్తారు. ఎవరినీనొప్పించక అందరితో కలుపుగోలుతనంగా వుంటారు. వీరికి జీవితములో అపజయము వుండదు. వీరి మాటకు అందరూ విలువనిస్తారు. వీరి మాటే కుటుంబంలో శిరోధార్యంగా వుంటుంది.

ఎడమపాదముపై కుడివైపు పుట్టుమచ్చ గలవారు సాదారణ జీవితము గడుపుతారు. వీరికి ఎక్కువగా అనారోగ్యము కలిగే అవకాశములు ఎక్కువగా వున్నాయి.

కుడిపాదము ఎడమభాగములో పుట్టుమచ్చగలవారు బుద్ధి స్థిరత్వము లోపించి ఎవ్వరినీ లెక్కచేయక జీవితము సాగిస్తారు. అనేక మంది పురుషులతో సంబంధాలు కొనసాగిస్తారు. ఎవ్వరినీ ప్రేమించరు. అందరినీ అనుమానంగా చూసి జీవితమును అసంతృప్తిగానే గడుపుతారు.

కుడిపాదమునకు కుడిభాగములో పుట్టుమచ్చగలవారు సాదారణ జీవితము గడుపుతారు. వీరికి ఇబ్బందులుండవు. ముందుగానే ఆలోచించుకొని అన్ని పనులు నిర్వహిస్తారు. ఎవ్వరినీ నొప్పించక అందరితో సన్నిహితంగా మెలిగే జీవితము

సుఖసంతోషాలతో గడపగలరు.

ఇంతవరకు పురుషుల పుట్టుమచ్చలు, స్త్రీలపుట్టుమచ్చల ఫలితములు గూర్చి చెప్పబడింది. వీటిలో మంచిఫలితాలుకలవి, అకస్మాత్తుగా ధనప్రాప్తి కలిగించేవి, ధనవంతులు అయ్యేవి, స్త్రీల వలన ధనవంతులయ్యేవి, దీర్ఘాయుష్షు కలుగజేసేవి, చెడుఫలితాలు ఇచ్చేవి, ధనవంతుని బికారిగా మార్చేవి, స్త్రీమూలముగా ధన నష్టము కలిగేవి, అకాలమరణము కలుగజేసేవి, పరస్త్రీలపై వ్యామోహం కలుగజేసేవి, గర్వాన్ని కలిగించేవి అదిగా గల పుట్టుమచ్చల గురించి క్లుప్తంగా.........

**మంచి ఫలితములు కలుగజేసే పుట్టుమచ్చలు........**

- రెండుకనుబొమల మధ్య
- నుదుటి కుడిభాగములో
- కుడికన్ను మీద
- కుడి కణతమీద
- ఎడమ కణతమీద
- కుడి కంటిలో
- కుడి కనురెప్ప లోపలిభాగము.
- శిరస్సు కుడిభాగములో సర్వ సంపదలు కలుగును.
- శిరస్సు ఎడమభాగములో మహాయోగి కాగలరు.
- ముక్కు కుడిభాగములో మహాయోగి కాగలరు.
- ముక్కుకి మధ్యగా క్రిందవైపు సకల సౌఖ్యములు, సుఖసంతోషములు కలుగును.
- గడ్డానికి కుడివైపు, మధ్యవున్న సంగీత, సాహిత్యాలలో ప్రావీణ్యత, కీర్తి, గౌరవ మర్యాదలు సంభవించగలవు.
- కుడి చెక్కిలిపై విశేష ధనార్జన కలుగును.





- రెండు చెవులపై మీద వుంటే అగర్భ శ్రీమంతుడుకాగలడు.
- చెవి ప్రక్కన పుట్టుమచ్చ వున్న వారికి పిత్రార్జితముంటుంది.
- నాలుక చివర పుట్టుమచ్చ వున్నవారికి వాక్చాతుర్యము, ఉన్నతవిద్య, అందరిచే గౌరవమర్యాదలు, కీర్తి ప్రతిష్ఠలు కలుగును.
- కంఠానికి కుడిభాగములో సిరిసంపదలు, శాశ్వతకీర్తి కలుగుతుంది.
- రొమ్ముకి కొంచెంపైన వున్న విశేష ధనార్జన, దేశ విదేశములలో కీర్తి ప్రతిష్ఠలు, గౌరవమర్యాదలు కలుగును.
- మోచేతిపైపుట్టుమచ్చ ఉన్న సకలభోగాలు కలుగును
- మణికట్టుపైపుట్టుమచ్చ వున్న విశేష ధన సంపాదన కలుగుతుంది.
- ముంజేతి మీద పుట్టుమచ్చ వున్న వ్యవసాయము, పాడిపంటలు సమృద్ధిగా వుండగలవు.
- కుడి అరచేతి చిటికెనవ్రేలు క్రింద పుట్టుమచ్చ వున్నలౌకికవ్యవహారములతోనేర్పు, ధన సంపాదనలో కొత్తదారులు తొక్కు తారు.
- కుడి అరచేతి ఎడమభాగమున ఉన్నఆకస్మిక ధన లాభము కలుగును.
- కుడి అరచేతి చిటికెనవేలిపై వున్న ధన సంపాదన, భోగలాలస జీవితము లభిస్తుంది.
- వెన్నుపై నల్లగా కొంచెం ఉబ్బెత్తుగా వున్న రాజకీయాలలో ప్రవేశించి మంత్రి పదవి చేపట్టగలరు.
- కుడి వృషణం మీద వున్న ధన సంపాదనలో మెలుకువలు కలిగి వుంటారు.
- కుడి తొడమీద వున్న విశేష ధనార్జన, పరస్త్రీ వలన వూహించశక్యముకాని ధనలాభము

★ కుడి మోకాలిపై వున్న అనుకూల దాంపత్యము, వైవాహిక జీవితము సంతృప్తిగా సాగగలదు.

**ఆకస్మికముగా ధనలాభము కలిగించే పుట్టుమచ్చలు**

★ నుదురు విశాలంగావుండి కుడిభాగములో పుట్టుమచ్చగలవారు

★ కుడి కణతమీద పుట్టుమచ్చగలవారికి లాటరీ వలన, వారసత్వమువలన,ధనలాభము కలుగుతుంది. పుట్టుమచ్చ ఎత్తుగా వుంటే ఫలితాలు అనూహ్యంగా వుంటాయి

★ ఎడమకణతపై పుట్టుమచ్చ వున్న ఆకస్మిక ధనలాభము

★ కుడి కంటిలో నల్లగుడ్డుకి కుడిభాగములో మచ్చగలవారికి ఆకస్మిక ధనలాభము కలుగుతుంది.

★ ముక్కుకి కుడివైపుగల పుట్టుమచ్చ

★ కంఠానికి పక్కగా ఏ వైపు మచ్చవున్నా దాయాదుల వలన ఆకస్మిక ధనప్రాప్తి కలుగును.

★ కుడి అరచేతి ఎడమభాగములో పుట్టుమచ్చ వున్న ఏ ప్రయత్నము లేకుండా లాటరీ , పందాల్లో విశేష ధన లాభము కలుగుతుంది.

★ కుడి తొడమీద పుట్టుమచ్చ వున్న భార్య ద్వారాగాని, పరస్త్రీ వలనగానీ ధనలాభము కలుగుతుంది.

**ధనవంతులు కాగలిగినవారికి వుండవలసిన పుట్టుమచ్చలు**

★ కుడి కనుబొమ మీద వున్న పుట్టుమచ్చ

★ ఎడమ కణతి మీద వున్న పుట్టుమచ్చ

★ కుడి కంటిలో నల్లగుడ్డుకి కుడివైపు వున్న పుట్టుమచ్చ

★ నుదిటిమిద కుడివైపు వున్న పుట్టుమచ్చ

★ కుడి కనురెప్ప లోపలిభాగమున

★ ముక్కుకి కుడివైపు పుట్టుమచ్చ





★ గడ్డానికి కుడి పక్కన పుట్టుమచ్చ

★ గడ్డం మధ్యగా వుండే పుట్టుమచ్చ

★ కంఠానికి ఇరువైపులా పుట్టుమచ్చలున్నా

★ రొమ్ముకు కుడిభాగమున పుట్టుమచ్చ వున్న మంచి సంపాదనకలిగిపేరు ప్రఖ్యాతులు కలిగి వుంటారు.

★ మణికట్టుకి కుడి ఎడమ భాగాలలో ఎక్కడవున్నా బాల్యంలోకష్టాలు, యుక్తవయసులో విశేష ధనసంపాదన కలిగి వుంటారు.

★ కుడి అరచేతిలోచిటికెన వ్రేలు కిందపుట్టుమచ్చ వలన విశేష ధన సంపాదన కలుగుతుంది

★ కుడి అరచేయి ఎడమభాగమున పుట్టుమచ్చ వుంటే ఆకస్మిక ధనలాభము కలుగుతుంది.

★ కుడివృషణంమీద పుట్టుమచ్చ వున్నా ధనమార్జించటంలో మెళుకువలు కలిగి వుంటారు.

★ కుడి తొడయందు పుట్టుమచ్చగలవారికి పరస్త్రీ వలన ధనలాభం,సౌఖ్యము కలుగును.

★ కుడిమోకాలిపై పుట్టుమచ్చ గలవారికి సకల విధముల ధనలాభము కలుగును.

**స్త్రీల వలన ధనవంతులు కాగల పుట్టుమచ్చలు**

★ కుడి కనుబొమ్మ మీద పుట్టుమచ్చ గలవారికి భార్య వలన గానీ, ఇతరత్రా స్త్రీ వలన (దాయాదుల ద్వారాగానీ,ఇతర బంధు వర్గము లో( స్త్రీల వలనగాని) ఆస్తి కలుస్తుంది. వివాహము జరిగిన తర్వాత ధన సంపదలుకలిగి సుఖ సంతోషములు కలుగును. వైవాహిక జీవితము ఆనంద ముగా సాగుతుంది.

★ గొంతుక మీద పుట్టుమచ్చ గలవారికి భార్య ద్వారాగానీ, భార్య తరపువారి వల్ల ఆస్తి విపరీతముగా వస్తుంది.

- ☆ కంఠం కింద తిలకింలా పుట్టుమచ్చ గలవారికి భార్య ద్వారా ధనలాభం కలుగుతుంది.
- ☆ కుడి తొడపై పుట్టుమచ్చ గలవారికి పరస్త్రీ వలన ధనప్రాప్తి కలుగుతుంది.

**దీర్ఘాయువు కలిగించే పుట్టుమచ్చలు**

- ☆ రెండు కనుబొమలపై స్పష్టముగా వుండాలి.
- ☆ శిరస్సు మీద మాడుకి ముందుభాగములో గలవారికి సంపూర్ణ ఆయుర్దాయము.
- ☆ కుడిచెక్కిలిమీద,ఎడమచెక్కిలిమీద పక్కగావుంటే ఆయుర్ధాయము ఎక్కువ.
- ☆ ఏ చెవి పక్కనైనా పుట్టుమచ్చ ఉన్నా చాలా కాలం జీవిస్తారు.
- ☆ సరిగా మోచేతిపై పుట్టుమచ్చ గలవారికి అనారోగ్యము లేకుండా జీవితము గడపగలరు.
- ☆ కుడి అరచేతి చిటికెన వేలు కింది భాగములో పుట్టు మచ్చ గలవారు చిరకాలం జీవిస్తారు.
- ☆ వెన్నుపూస చివర, పిరుదులపై మధ్య దీర్ఘాయువు కలుగుతుంది.
- ☆ కుడి వృషణము మీదపుట్టుమచ్చ వున్న మంచిది. అనారోగ్యము కలిగే అవకాశము తక్కువ.

**చెడు ఫలితములు కలిగించే పుట్టుమచ్చలు**

- ☆ ఎడమకంటి రెప్పమీద వున్న పుట్టుమచ్చ
- ☆ ఎడమకంటి గుడ్డుకి కుడిభాగాన వున్న పుట్టుమచ్చ
- ☆ ఎడమకంటిలో గుడ్డుకి ఎడమభాగాన వున్న పుట్టుమచ్చ
- ☆ ముక్కుకి కింద భాగములో వున్న పుట్టుమచ్చ
- ☆ ఎడమ కణతపై వున్న పుట్టుమచ్చ





- ☆ గడ్డానికి ఎడమ ప్రక్కన వున్న పుట్టుమచ్చ
- ☆ క్రిందపెదవి, క్రిందపెదవిలోపలి భాగన వుండే పుట్టు మచ్చలు
- ☆ కుడిచెవి క్రింద పుట్టుమచ్చ వున్నవారికి ఋణబాధలు కలుగును
- ☆ ఎడమచెవి క్రింద భాగాన పుట్టుమచ్చగలవారు
- ☆ సరిగా కంఠముపై పుట్టుమచ్చ వుండి, పుట్టుమచ్చపై వెంట్రుకలుండిన బాల్య యౌవనదశలలోసుఖము అనుభవించి వృధ్యాప్యములోబీదతనము కలిగ్ అవస్థలు పడగలరు.
- ☆ కంఠముపై పుట్టుమచ్చ వుండి, వెంట్రుకలు లేకపోతే బీదరికం కలుగుతుంది.
- ☆ ఎడమ కుచముమీద పుట్టుమచ్చ కలిగిన వారు స్వయంకృతముగాకోరి కష్టనష్టాలు పొందుతారు.
- ☆ రొమ్మునకుఎడమభాగంలో పుట్టుమచ్చవలన చంచలత్త్వము, మోసకారితనముగా వుంటారు.
- ☆ ఎడమపక్కటెముకలమీద పుట్టుమచ్చ వుంటే అనేక యిబ్బందులు కలుగును.
- ☆ భుజముల నుండి కటివరకు కుడిఎడమలవైపు ఎక్కడున్నా అర్ధిక ఇబ్బందులు కలుగును.
- ☆ రొమ్ము మధ్యపుట్టుమచ్చ వుండి దానిపైవెంట్రుకలు వున్నచో దరిద్రబాధ అనుభవిస్తారు.
- ☆ కుడిచేతి మధ్యవేలు కిందభాగములో పుట్టుమచ్చ వల్ల పిత్రార్జితము నాశనమవగలదు.
- ☆ కుడిచేతిమణికట్టుఅడుగుభాగములో పుట్టుమచ్చ వుంటే అనవసర ధనవ్యయము, తిరుగుబోతుత నముకలిగి, ఏకాకిగా జీవిస్తారు.

☆ కుడిచేతిచూపుడువ్రేలు మీద పుట్టుమచ్చగల వారికి శత్రువులధికము. నీచతనముకలిగి ఇతరులను నిందించి ఆపదలు పొలగుదురు.

☆ కుడి పిరుదుపై పుట్టుమచ్చగలవారికి దరిద్రము కలుగుతుంది.

☆ ఎడమతొడపై పుట్టుమచ్చగలవారు నీచస్త్రీ సాంగత్యముకలిగి జీవితము నిస్సారమవుతుంది.

☆ ఎడమపిరుదులపైపుట్టుమచ్చ వలన ధననాశనము కలిగించును.

☆ గజ్జలలో పుట్టుమచ్చ గలవారికి దరిద్రము, అల్ప ఆయుర్దాయము, సేవకావృత్తి కలగగలవు.

☆ ఎడమమోకాలిపై పుట్టుమచ్చ గలవారికి పరస్త్రీ లోలత్వము,స్వయంకృతముగాకష్టాలు కలిగించు కుంటారు.

**ధనము కలిగినవారిని బీదవారుగా చేయునవి.**

☆ ఎడమకంటిలో గుడ్డుకి కుడి ప్రక్కన గలది.

☆ ముక్కుకి కింద భాగాన గలది.

☆ క్రిందిపెదవిపై పుట్టుమచ్చ వల్ల ఆస్తినాశనము.

☆ కంఠము మీద పుట్టుమచ్చ వల్ల జల్సాజీవితము వల్ల ఆస్తి నష్టము, అనవసర కష్టాలు కలుగును.

☆ కుడికుచము మీద పుట్టుమచ్చవల్ల పిత్రార్జితము పరులపాలు

☆ కుడిచేతి మధ్యవేలు కింగభాగములో పుట్టుమచ్చ గలవారికి స్త్రీ లోలత్వము వల్ల ఆస్తి నాశనము

☆ కుడి చేతి మణికట్టు అడుగుభాగములో పుట్టుమచ్చ వలన దేశాలు పట్టి తిరగటం, అనవసర ఖర్చు





జీవితములో అనేక కష్ట నష్టములు కలుగును.

☆ కిందపెదవి లోపలిభాగమున పుట్టుమచ్చ గలవారికి స్త్రీ కాంక్ష అధికము.

☆ కుడి చేతిమధ్యవేలు కింద భాగమున పుట్టుమచ్చగలవారికి పరస్త్రీ సాంగత్యము.

☆ ఎడమతొడ అందు పుట్టుమచ్చ వున్నను.

☆ గజ్జల్లో పుట్టుమచ్చవల్ల స్త్రీలోలత్వము కలుగును.

**అకాల మరణమునకు గురిచేయునవి**

☆ ఏ కంటి చివరనైనా పెసరగింజంత పుట్టుమచ్చ వున్న.

☆ ఎడమకంటిలో కొలకుల్లోపుట్టుమచ్చ వున్న.

☆ మెడ వెనుక ప్రదేశంలో పుట్టుమచ్చలున్న రాబోవు ఆపదల నుండి తప్పించుకుంటారు.

☆ ఎడమచంకలో పుట్టుమచ్చ వున్న స్త్రీ వల్ల అపాయకరము.

☆ గజ్జల్లో పుట్టుమచ్చ వలన అకాల మరణము కలిగే అవకాశముంది.

**పరస్త్రీ పై వ్యామోహం కలిగించేవి.**

☆ రెండు నొసళ్ళ మధ్య పుట్టుమచ్చ వుంటే చాటుమాటు వ్యవహారాలున్నా జీవితానికి నష్టము కలగదు.

☆ ఎడమకంటి గుడ్డకి కుడిభాగంలో పుట్టుమచ్చ గలవారు భార్యగాక మరో స్త్రీని వుంచుకుంటారు.

☆ తలపై వెనుక భాగములో పుట్టుమచ్చ గలవారికి పరస్త్రీ వ్యామోహం కలుగుతుంది.

☆ ముక్కుకి ఎడమవైపు పుట్టమచ్చ గలవారు నీచ స్త్రీలతో సంచరిస్తారు.

☆ ఏ పెదవిపైన గానీ, కిందపెదవిపైన గానీ, పుట్టుమచ్చ

గలవారు రహస్యముగా వ్యభిచరిస్తారు.

☆ ఎడమచెవి కొసన పుట్టుమచ్చగలవారు, ఎడమస్తనము పుట్టుమచ్చ గలవారికి కామోద్రేకము ఎక్కువగా వుండి పరులతో సంబంధాలు కలిగి వుంటారు.

☆ సరిగ్గా మోచేతి మీద పుట్టుమచ్చ గలవారు.

☆ ముంజేతి మీద పుట్టమచ్చ వున్నను.

☆ కుడిచేతి మధ్యవేలు కింద భాగము పుట్టుమచ్చ వున్న

☆ కుడి చేతి చిటికెనవేలు మీద పుట్టుమచ్చ వున్నను.

☆ ఎడమ చట్టపైన పుట్టుమచ్చ వున్న.

☆ కుడి వృషణము మీద పుట్టమచ్చ గలవారు భార్యనుగా మరొక స్త్రీ తో సంబంధముంటుంది.

☆ లింగము మీద పుట్టుమచ్చ ఎక్కుడున్నా కామవాంఛ అధికము.

☆ కుడి తొడ మీద పుట్టుమచ్చ వున్న నీచస్త్రీ సాంగత్య

☆ గజ్జల్లో పుట్టుమచ్చ గలవారు నీచాతి నీచమయిన స్త్రీ సాంగత్యము

☆ ఎడమ మోకాలిపై పుట్టుమచ్చ గలవారు అన్యస్త్రీతో వ్యామోహము కలిగి వుంటారు.

### గర్భాన్ని సూచించునవి

కంటిరెప్ప మీద పుట్టుమచ్చ గలవారు

☆ ఎడమకంటిలో గుడ్డుకు ఎడమవైపు గల పుట్టుమచ్చ

☆ ముక్కు చివర గల పుట్టుమచ్చ

☆ రెండుచెవులపై రెండు పుట్టుమచ్చలున్నా

☆ ఎడమస్తనముపై పుట్టుమచ్చగలవారు ఒకరి మాటదేనికి వినాలనే అహంకారము కలిగివుంటారు.